# ఈనాటకమున వచ్చు పాత్రలు.



## పురుషులు.

1. సూత్రధారుఁడు—నాటకము నెరిగించువాఁడు.
2. జయంతుఁడు—కథానాయకుఁడు
3. జయపాలుఁడు—జయంతుని మిత్రుఁడు
4. గుణపాలుఁడు—జయంతుని తండ్రి. రాజు
5. జయవర్మ—గుణపాలుని మంత్రి. జయపాలుని తండ్రి
6. కళాశేఖరుఁడు—జయంతుని మామ
7. వసంతుఁడు—కళాశేఖరుని కుమారుఁడు
8. సుబుద్ధి—కళాశేఖరుని మంత్రి
9. గోపాలరావు—న్యాయవాది
10. కన్నిగాఁడు—మేదరి.

## స్త్రీలు.

1 కమలవతి—కథానాయిక
2 కళావతి—కమలవతి చెలికత్తె
3. చంద్రముఖి } వేశ్యాంగనలు
4. బాలామణి }
5. సుగుణమణి—జయపాలుని భార్య
6. సఖీమణి—సుగుణమణి స్నేహితురాలు.
7. నటి—సూత్రధారుని భార్య

నోటు:—ఇంకను కథాసందర్భమున స్త్రీ పురుషులు వత్తురు

దునిం బోలి బ్రాహ్మణభక్తి నెప్పుడును మరువక కుండుటచే
దరిద్రులును గలిగి దేవేంద్రసభాభవనంబు వోలె దేజరిల్లు
చున్నది; గాన నీసభికుల నేనాటకం బాడి యానందింపజేయ
గల్గుదును. (ఆలోచన నభినయించి) ఆఁ! జ్ఞాపకము వచ్చినది.
ప్రియసీ! నీసింగారం బయిన నొక్కసారి ఇటు రమ్ము.

నటి:—(ప్రవేశించి) నాథా! నమస్కారము

సూ:—సుమంగలీ భవ!

నటి:—నాథా! న న్నింతత్వరగా బిలువ హేతు వేమో దెలుప
దగు నేని దెలుపగోరెద.

సూ:—సఖీ నీవడ్గ దాచుటకు రహస్యాంశ మేమున్నది. యీసభా
సదులు నవరసగుంఫిత మైయొప్పారు నవీననాటక మేదైన
ప్రదర్శించి మ మ్మానందింపజేయు మని యాజ్ఞాపించి
యున్నారు. గాన మన మిప్పు డట్టినాటకరాజ మేదైన
ప్రదర్శింపవలయు.

నటి:—ఆర్యపుత్రా! అట్టినాటకరాజ మేదో తమరే దెలుపవలెను.

సూ:—ప్రాణసఖీ! ఆనాటకము పేరు నేనే చెప్పవలయునా చెప్పెదను
వినుము.

నటి:—వినుటకు సర్వసిద్ధముగ నున్నదాన.

సూ:—ప్రియసీ! నవరసగుంఫిత మై యొప్పునదియు నవీనముగా
వ్రాయబడినదియు నైన జయంత జయపాలము ప్రదర్శించిన
యెడల మన మీసభ్యుల సంతృప్తి నొందింపగలము

నటి:—నాథా! ఇంకొకసారి యానాటకము పేరు నుడువుడు
నావీనుల కింపుగా విని సంతసించెద

సూ:—ఆనాటకము పేరు జయంత జయపాలము.

నటి:—ఆహా! యేమి దానిసారస్యము ప్రాణేశా! యీరూపక మెవ్వరు రచించి ప్రసిద్ధి కెక్కిరి?

సూ:—ఇది యొక బాలకవి రచించెను.

నటి:—నాథా! బాలకవి యనుచున్నవారు ఆకవినామాక్షరము లెయ్యవియో దెలిపి నన్ను సంతసపరుపుము?

సూ:—ఇదిగో వినుము.

సీ॥ గురుతర కౌశిక • గోత్రవిఖ్యాతుండు
బుచ్చన్నశాస్త్రి యే • పూజ్య తండ్రి
నిఖిలవిద్యావహా • న్నిపుణజగన్నాథ
పండితశ్రేష్ఠు డే • వ్వాని తాత
నిఖిలపాతివ్రత్య • నిష్ఠాగరిష్ఠాత్మ
నరసమాంబే భవ్య • నకును నల్లి
సతితుల్యకీర్తి యై • సతులలో ప్రథగన్న
అచ్చమాంబే భవ్య • కబ్బయమ్మ

తే॥ గీ॥ ఆదిశాఖను యేపూజ్య • డవతరించి
బాలకవి యనునామము • న్బడసి వెలసె
భవ్యహనుమంతవఝ్ఝల • వంశమందు
నవరసజ్ఞుడు శ్రీజగ • న్నాథు డతడు. 3

నటి:—నాథా! యీబాలకవి దీనికిపూర్వ మేగ్రంథము లయిన రచియించెనా?

సూ:—ఇదివరలో స్వగ్రామస్థితుడగు శ్రీరామలింగేశ్వరస్వామి మీద శ్రీరామలింగశతకము రచియించెన; అంతియేగాని నాటకము లేమియు రచియి చలేదు. ఇయ్యదియే ప్రారంభ నాటకమగుటచే యీకవి సభాసదులకు దనవాక్కులుగా నిట్లు చెప్పు డని వ్రాసియున్నాడు.

నటి:—ఎట్లు?

సూ:—తొందరపడెదవేల.

నటి:—తొందరగాదా, ఇప్పటికే తొమ్మిదిగంటలువినవచ్చినవి. సభాస్థు లందరు మాకు "తొమ్మిదిగంటలకు నాటకము ప్రారంభ మగునని పేపరులో ప్రచురించితిరి. తొమ్మిదీ అయి దునిమిషములయినను ప్రారంభించలేదు." అని ప్రతివారును వాచీలను చూచుచుండిరి. యెంతసేపి ట్లాలస్యము.

సూ—అట్లయినచో చెప్పుచున్నాడ వినుము.

ఉ॥ బాలుడ విద్యలందుఘన • పాండితిలేదు వయస్సుజూడగా
షోడశవర్షయుక్తమయి • శోభిలుచుండెను చిత్తమెప్పుడున్
బాలవినోదము ల్సలుప • బాల్యము చుండెను వేడుకుందు నో
కాలవిధిజ్ఞులార! నను • గావుడు లోపము లెన్నియుండినన్.

నటి;—ప్రాణేశ్వరా!

తే॥ గీ॥ కాలమేగెను చాలగా • గానమనము
పాత్రలను సిద్ధముగజేయు • వలయు వేగ
నరుగుదము రమ్ము గుణపాల • నరవిభుండు
అల్లదే వచ్చుచున్నాడు • కల్ల గాదు. 5

(అని యిరువురును నిష్క్రమింతురు)

ఇదిప్రస్తావన.

---




# జయంతజయపాలము.

ప్రథమరంగము—ఆస్థానమంటపము

ప్రవేశము—గుణపాలుడు.

గు:—ఆహా! కాల మెంత విపరీతముగా నున్నది.

చ॥ తనయులు లేమికిఁ వగచి • తాపసవృత్తి జరించి యాహరి
న్ననిశము బూజజేసి సుగు • ణావృతు వీరవిహారసుందరున్
దనయుని గాంచి పెండిలియు • దద్దయు జేసితి గాని మంత్రిపు
త్రిని క్షణమైన బాయ డిసి • రో! తనభామిని నెంచ డెప్పుడున్॥

వివాహం బయి నాల్గయిదువర్షంబు లాయె. ఇన్నిదినముల నుండియు శ్వశురగృహంబున కేగుట గాని, భార్యను దీసికొనివచ్చుట గాని జరుగలేదు. మంత్రితనయుని యొక్క త్రుటికాల మైనను నెడబాసి యుండడు. ఇట్లెన్నినా ళ్లున్న లాభ మేమి?

ద్వా:—(ప్రవేశించి) మహారాజా ద్వారముకడ మంత్రివర్యుండు తమదర్శనమునిమిత్తము వేచి యున్నాడు.

గు:—త్వరగా ప్రవేశపెట్టుము.

ద్వా:—చిత్తము (అనినిష్క్రమించును)

(మంత్రి యగుజయవర్మ ప్రవేశించి)

తే॥ గీ॥ దుష్టులను శిక్ష జేయుచు • శిష్టజనుల
రక్షణము జేయుచును వేడ్క • రాజ్యమెల్ల

నింపుమీరగ ప్రీమతో నేలువాడ
జయము గుణపాల రాజేంద్ర జయము జయము.

గు:—మంత్రివరా! అయ్యాసనంబు నధిష్టింపుము.

జ—చిత్తము (అని కూర్చుని తనలో)

సీ॥ తనయులు లేమిచే • నని శము శ్రీమహా
విష్ణుని ధ్యానించి • విమలకీర్తి
గల్గు సుపుత్రుని • గాంచి విద్యలలోన
పండితుం డనుపేరు • బడయ జేసి
పదిరెండు వర్షముల్ • బాగుగా గల్గిన
సుగుణవతి యనెడి • సుందరాంగి
నిచ్చి వివాహంబు • నెంతో గొప్పగ • జేసి
నాల్గువర్షము లాయె • నాటినుండి

తే॥ గీ॥ నేటివరకును ప్రియభార్య • నెమ్మొగంబు
జూడకే రాజసుతునితో • వేడుకలర
గ్రీడలను సల్పుచుండెను • వీడకుండ
నాహా కలిమాయ యిట్లనే • యరుగు గాదె.

గావున నేయుపాయంబుచేత నయిన రాజసుతునకును మత్కుమారు నకును స్నేహం బెడబాపి విరోధము గల్పించి వేరుజేసిన నప్పుడైన భార్యాన్వేషణంబున కేగుదురు(ప్రకాశముగా)మహారాజా యిద్దివసంబున మీముఖకమలం బేటికో యిట్లుదెల తెలవోవుచున్నది.

—గు:—న్న: ఆహా నాయాలోచన మంత్రి కెట్లుదెల్పుదు. తెల్పిన అతడే మనుమానించునో. యెట్లయినను చెప్పక తప్పదు (ప్రకాశముగా) అమాత్యరత్నమా రేమని చెప్పుదు. నాకుమారునకును నీపుత్రునకును వివాహంబులయి నాలుగైదు వత్సరములాయె. యింతవరకా యిద్దరును భార్యలను తలచుట లేదుగదా. యిట్లెంతకాలముండిన నేమిప్రయోజనము గావున

చ॥ అనుజులరీతి నెల్లపుడు • హాయిగ క్రీడలయందె దేలుచున్
మనమున వేరుచింతలను • మాని చరించు కుమారవర్యులన్
మన మొకతంత్ర మేర్పరచి • మానుగ వారికి భేదభావమున్
బనివడి జేయనిద్దరును • బాగ విరోధము నొంది పీడరే.

అట్లు జేసిన వార లొండొరులు మనస్పర్థలు గలిగి యెవరికాంత కొరకు వార లేగుదురు గాన దీనికి నీవు సమ్మతించవలయును.

జ:—ఆహా నే ననుకొనినట్లే రాజును గూడ దలంచెనియ్యెదినాకును గూడసమ్మతమే గావున నేనునట్లే యొప్పుకొనెద. (ప్రకాశముగా) మహారాజా మీరు ప్రయత్నించుకార్యమునకెన్నడయిన వ్యతిరేకముగా నుడివితినా యీ కార్యము నాకు మాత్రము లాభము లేనిదా.

గు:—అట్లయినచో యేయుపాయము చేయుదము.

జ:—వారు సాధారణ మైనమాయలలో బడరు. గాన వేశ్యామాయలవల్ల యేదయిన కొంతకార్య మగునేమో జూతము.

గు:—మంచియుపాయము జ్ఞప్తికి తెచ్చితివి. యెవడురా అక్కడ

ద్వా:—మహారాజా యేమి సెలవు

గు:—నీ వేగి వారవనితాలలామ యగుచంద్రముఖి నిచ్చటకు దోడుకొని రమ్ము.

ద్వా:—చిత్తము (అని నిష్క్రమించి మరల చంద్రముఖితో ప్రవేసించును)

ద్వా:—మహారాజా ద్వారరక్షణకు పోయెద.

గు:—పొమ్ము. జాగ్రతగా నుండుము (ద్వా॥నిష్క్రమించును)

చం:—మహారాజా నమస్కారము మంత్రివరా నమస్కారము.

గు. జ:—ఇష్టార్థసిద్ధి రస్తు.

చం:—మహారాజా నన్ను పిలువనంపిన కారణం బెరుగగోరెద.

గు:—నిన్నుకొండొకకార్యార్థమై పిలువసంపితి. నెరవేర్చెదనంటి వేని దెల్పెద.

చం:—భూవరా దాసితోసమానురాల నగునేనేడ మీకార్యమును సాధించు టెఁడ. అయినను నాయావచ్ఛక్తి వినియోగించి దేవరవా రాజ్ఞాపించు కార్యము నెరవేర్చి కీర్తి బొందెద. దెల్పుడు.

గు:—మా కార్యము వినుము.

తే॥ గీ॥ మతుమారవర్యనకును • మన్త్రితనయు
నకును భేదంబు గలుగంగ • బ్రకటమయిన
మాయలను బన్ని బహుమాన • మందవలయు
జోడు విడదీసి నీనేర్పు • జూడవలయు.

చం:—(నవ్వుచు) ఇదియా మీ రాజ్ఞాపించు కార్యము. దీని కింత చెప్పవలయునా యిది నాకు గణనలోని కార్యము గాదు.

సీ॥ పటువేషములు బన్ని • విటకాండ్ర నెల్లను
వశ్యులుగా జేసి • వరలు దాన
మటుమాయలను బన్ని • మాన్యము లమ్మించి
విత్తమార్జించుచు • వెలయు దాన
లేనిదోసము జెప్పి • వీనుల కింపుగా
భార్యాభర్తల నెడ • బాపు దాన
షష్టిపూర్తియనిధనం • బార్జించివానిప
కీరు జేసి మరొక • నేరుదాన

తే॥ గీ॥ నిదియు నది యంచు వేరుగ • నెన్నకుండ
జేయగలనాకు నిది యొక • చిన్నపనియె
గాన వేడ్కసి కీర్తిని • గాంచు దాన
రమ్యగుణపాళి యో మహా • రాజమౌళి.

నాకు సెలవు దయచేయుము నే నేగెద.

గు:—సరే కాని కార్యము సానుకూలముగా జేయవలయును సుమా

చం:—చిత్తము (అని నిష్క్రమించును)

గు:—అమాత్యరత్నమా మనకు గూడ వేళ యయినది గాన పోవు దముకీ రమ్ము. (అందరు నిష్క్రమింతురు)

ద్వితీయరంగము—ఉద్యానవనము

ప్రవేశము—చంద్రముఖి, బాలామణి

చం:—చెలీ బాలామణీ యీవన మెంతరమణీయముగా నున్నదో చూచితివా!

సీ॥ ఏవంక జూచిన • నింపుగా జాజిపూల్
పుష్పించె గన్నుల • పుణ్య మనగ
ఏచాయ గాంచిన • నాచాయ గన్నేరు
పుష్పము లూచెను • పూర్ణముగను
ఏప్రక్క జూచిన • పూప్రకరములచే
బాగుగా నిండె పు • న్నాగతరులు
ఏదెస గనుగొన్న • నింపుగుల్కెడు పారి
జాతము ల్పుష్పించె • నూతనముగ

తే॥ గీ॥ ఏప్రదేశము నైన నిం • కెచట నయిన
సర్వవిధజాతివృక్షము • ల్సరసముగను
పండుటాకుల బడవైచి • బాగచిగురు
లీలమయి దాల్చె వాసంత • కాలమహిమ.

బా:—చెలీ చంద్రముఖీ అటుజూడుము.

తే. గీ. అచట శుకపికశారిక • లరచుచుండె
వీనులకు నింపుగుల్కుచు • వీణవోలె

గానము సేయుచుండె భృంగసముదాయ
మెల్లరో చెలి యివ్వనం బెంతసుఖము.

చం—చెలీ మన మే తెంచినపని యేమి చేయుపని యేమి.

బా—నే నేమెరుగుదు. వనవిహారమున కేగుద మని గొనివచ్చితివి. వనవిహారము సల్పుచుంటి మింకేమిపని యున్నది.

చం—(చిరునగవుతో) నీకు తెలియనే లేదటే

బా—యేదది.

చం—నే నీరోజున చేసినపని.

బా—తెలియలేదు. అదేదో చెప్పుము?

చం—నే నీరోజున ప్రొద్దుననే లేచి కాల్యకృత్యంబులం దీర్చి ఆభరణధారణంబు జేయుచుండ మహారాజు పిలువనంపిరి.

బా—తరువాత

చం—వెంటనే నే బయలుదేరి రాజదర్శనార్థ మై యేగితి. అంత మహారాజు గారు చాలా సన్మానించి నాకుమారునకును మంత్రినందనునకును విరోధము గల్పించి వేరుజేయవలయునని యాజ్ఞాపించిరి.

బా—తరువాత తరువాత.

చం—ఇది నాకు ఘనకార్యము గాదని ప్రగల్భంబులం బలికి వేరు జేసెద నని ప్రతిజ్ఞం బట్టితి గాన ప్రతిన నెరవేర్చుకొనవలయు గదా.

బా—ఇదియా నీ విరోజునచేసినపని ఏదియో ఘనకార్య మనుకుంటి చాలు చాలు ఆవులు రెండును విరోధపడి మధ్య లేగదూడను త్రొక్కినట్టు రాజుగారు నీవును ప్రతినలుబట్టు టేమి. మధ్య మిత్రుల స్నేహలతను ద్రుంపదలచు టేమి.

చం—చెలీ అట్లొనర్చినచో మనము గొప్పబహుమాన మందగలము.

బా—ఆ. అందకేమి. రాజుగారిచే బహుమానము ప్రజలచే నిందలు.

చం—చాలు నీవాక్చాతుర్యము గట్టిపెట్టుము.

బా—మిత్రులమిత్రత్వమును విడదీయుట పాపహేతు వని పెద్దలు వక్కాణింతురు గాన యిట్లు చెప్పితి. నాకేమి.

చం—అటుల పాపపుణ్యములు దలంచినపక్షమున మనకులమువా రందరు ముష్టియెత్తి జీవించవలసినవా రై యుందురు. యిట్టి నీతులు బోధించుచుండుచు నీవాచరించెడి కృత్య మేమి యిదివర కొకరిని దివాలా తీయించితివి. యిప్పుడు మరొకని తీయుటకు ప్రయత్నించు చుంటివి.

బా—దానివల్ల నేరము లేదు. యేమంటివేని వారు ధనమడమముచే కోరివ్వి స్వయముగా యిచ్చినప్పుడు గ్రహించుట తప్పా. రాజమంత్రిసుతులన్న నో నీకెట్టియుపకారమును జేయలేదు. నిష్కారణముగ బహుమానమున కాసించి మిత్రత్వమును భంగముచేయ దలచుచుంటివి. యి దెట్టికృత్యమో నీవే యాలోచించుకొనుము.

తే. గీ. స్నేహితుల నైన పతిసేవ • జేయు భార్య
నైన పితృభక్తి గల్గిన • నరుని నైన
భేదభావము జేయంగ • పెక్కుపాప
ఫలము గల్గు నటంచును • బల్కరే చెలి.

చం—చెలీ నీవు చెప్పెడివాక్యము లన్నియు పూర్వకాలయోగ్యం బులు గాని యిక్కాలంబున నయోగ్యంబులు దీనికి మన వారు మనకులాచారంబుల నిట్లు చెప్పిరి. వినుము.

సీ. తండ్రికొడుకుల నైన • దగ వేరుగా జేసి
ధనము నార్జించుటే • గణికవృత్తి
భార్యభర్తల నైన • భంగము జేసియు
ధనము నార్జించుటే • గణికవృత్తి

మాతాసుతుల నైన • మర్మము జేసియు
ధనము నార్జించు చే • గణికవృత్తి
మిత్రివర్యుల నైన • మిత్రత్వ మెడబాపి
ధనము నార్జించు చే • గణికవృత్తి
తే. గీ. ఎట్టి ద్రోహము లైన ని • కెన్ని క్రూర
కార్యములు నైన జేయు చే • గణికవృత్తి
ఎన్నిమటుమాయ లైనను • బన్ని విటుల
కడ ధనంబును లాగు చే • గణికవృత్తి.

యిట్టి కులాచారంబు లన్నియు మనకుండ కులాచారంబుల వీడుట పాపహేతువు గాదా. యిప్పుడైన బోధపడినదా.

బా—చెలీనీవు వినిపించిన నీతివాక్యములు నాకునచ్చినవి. ఇప్పుడు వీరల నెట్లయిన నెడబాపి బహుమానమందుటయే మేలని తోచుచున్నది. కాన వారలుండుచోటరయుదమురమ్ము.

చం—వారలివ్వనమునందే విహరించుచుందురు. నావెనువెంటనే రమ్ము. నేజూపెద.

బా—ఇదేవచ్చుచుంటి నకువుము.

చం—

తే. గీ. మణిమయవికారమైనయా • మంటపమున
రమ్యసుమములుగలదన • లక్ష్మిజూచి
సంతసంబునుబొందెడి • సాహసులగు
స్నేహవర్యులజూచితే • చెలియనీవు.

బా—

తే. గీ. చూచితినిగానివారల • జూడజూడ
స్నేహభావము విడదీయు • చెలియదగద

టంచు నామదియందున • నెంచుచుంటి
నిట్టిమిత్రిత్వమెడబాప • నెట్టులౌనె.

చం—చెలీ యేమింతవెర్రిదానవు. ఎన్నియో మాయోపాయంబులు బన్నియైన విరోధము గల్పించి వేరు జేయవలయుగాని మరలమరల యిట్టియజ్ఞానాబ్ధిలో బడనగునా. నీవు వేశ్యవుగావా!

భా—చెలీ నామానసము నీహృదయము వోలె కఠినమయినదిగాదు అందుచేతనే గదా. నీవలె ధనమార్జించుటయు నొరుల మోసపుచ్చుటయు నెరుగను.

చం—అవునమ్మా నీవుచాలా అమాయకపుపిల్లవు. మొన్నకన్నరికమునకు పంతులుగారివల్ల నాలుగుయెకరములభూమి వ్రాయించిపుచ్చుకుంటివి. నీహృదయము మృదువగుటచేతనే గాబోలు ధనమంతయు లాగి గోపాలరావును జోగిజేసితివి.

భా— దానికేమిగాని ముందుసంగతి నాలోచింపుము. వారల భేదించుటకు నేదైనయుపాయు మాలోచించితివా.

చం—యుపాయములకేమి చూచుచుండుము మేనొక్కనిమిషములో విడదీసెద.

భా—చెలీ వారిరువురేదో ప్రసంగించుచున్నవారు. ఆప్రసంగానంతరమరుగవచ్చును. అంతవరకీ పొదచాటున దాగియుందమురమ్మా.

(అనియిరువురును తెరచాటున కేగుదురు.)

తృతీయరంగము—ఉద్యానవనము.

(ప్రవేశము—జయంతుడు, జయపాలుడు)

జ—ఆహా యేమి యీఉద్యానవన సౌరభ్యము.

సీ॥ ఒకచోట సుమముల • మకరందమానుచు
సంతసించెడి భృంగ • సంతతులును,

ఒకవంక చిగురుల • శకలము ల్భక్షించి
సంతసించెడి పిక • సత్కులంబు,
ఒకచాయ జలధర • ప్రకరములను గాంచి
యాడెడి నెమళుల • వేడుకలును,
ఒక ప్రక్క మధుఫల • శకలముల్దినుచును
సంతసించెడి శుక • సముదయంబుఁ
తే॥ గీ॥ అట్టి యువ్వనమందు నా • హాయటంచు
కొంత కాలము విహరించి • కోర్కెమీర
మదికి సంతోషమునుగూర్చి • మరలి గృహము
కేగుదము ప్రాణమిత్రుఁడా • వేగముగను.

జయ॥

తే॥ గీ॥ వింత ఫలపుష్పరాజుల • కాంతిగలిగి
దేవతావనమువలెను • దేజరిల్లు
యువ్వనంబున సఖుఁడ యొ • క్కింతకాల
మాఁగివిహరించిపోదమో • మాన్యచరిత.

జ—సఖా జయపాలా! అట్లే చేయుదముగాని యిప్పు డొక్కింత యాయాసంబుగా నుండె గాన యీ మంటపరాజమున యొక్కింత కాలమాఁగి తుదను వనవిహారము సల్పుదము.

జయ—అట్లే చేయుదము (అని యిరువురు నా మంటపమున విశ్రమింతురు.)

జ—మిత్రత్వంబుకన్న వేరొండు సౌఖ్య మిజ్జగంబున లేదు కదా.

జయ—సఖా మనమైత్రిలతను గోయనెంచి మనజనకు లెంతెంత ప్రయత్నముల జేసిరి.

జ—ఎన్ని ప్రయత్నములు జేసిన నేమి మనమైత్రికించుకైన భంగము గలిగెనా.

జయ—యువరాజా యేలకలుగును చినతనమాదిగా గలిసిన మన మిత్రత్వమునకు, భంగము గలుగజేయ పితామహునికైన దరంబే.

జ—సఖా నీవెన్నటికిని మన మైత్రికి భంగము గలుగునని దలంపకుము.

(ప్రవేశము—దూరమున చంద్రముఖి)

జయ—మిత్రశేఖరా అల్లదెయాదెసనుండి యెవ్వతెయోయొక్క ముద్దియహంసగమనంబునయిట్లేతెంచుచున్నది జూడుము.

జ—(చూచి) ఆహా యేమి దాని శరీర సౌందర్యము వర్ణింపనలవి గాకున్నది.

ఉ. తమ్ములబోలు కన్నులును • దామరతూండులబోలు బాహులుఁ
గమ్మని మేని తావెయును • గస్తురి బొట్టును గల్గుమోమునుఁ
సొమ్ములు గల్గు కంఠమును • సుందరమై హరిబోలు మధ్యముఁ
బొమ్మను బోలు రూపమును • భోగము గోరుచు నున్నవోసఖా

మరియు

క. రతియోయల కమలాసను
సతియో దేవేంద్ర పాణి • సఖియో వేశ్యా
సతియో వాసంతుని మద
పతియో యన జెప్పనొప్పు • వరసఖ దీనిన్.

ఆహా దీని సుందరవదనారవిందమును జూచి మదీయడెందం బమందానందంబు నొందుచున్నయది. గాన దీని చేపట్టణంబో యెవ్వతెయో దీనిం జేకొని యేనృపకుమారుండు సౌఖ్యాబ్ధి నోలలాడు చుండెనో యిచ్చోటునకు వచ్చుటకు గతం బెయ్యదియో గనుగొని రమ్ము వేగబొమ్ము.

జయ—మిత్రమా దీనినేమియు గనుగొన నవసరములేదు. ఇది మన పట్టణంబున నుండెడి వేశ్యయే. దీని నామము చంద్రముఖ యందురు.

జ—సఖా యిది చంద్రముఖ యన్ననామమునకు దగియే యున్నది. గాన యీరేయి దీనిగృహమునకు మన మరుగవచ్చును గదా.

జయ—శివశివా (అని చెవులు మూసుకుని)

ఉ. అక్కట యిట్టివాక్యముల • నాడగ నీకెటుదోచెనయ్యయో
గ్రిక్కన బోదె కీర్తి పర • కాంతల బొంద దలంచిన న్సఖా
యెక్కుడు పాపమంటుగద • హేళనజేయుచు నుందు రీజనుల్
నిక్కము సుమ్ము నమ్ముమిక • నీవు నెరుంగని శాస్త్రమున్నదే

జ—మిత్రరత్నమా నీవనిన ట్లియ్యది పరభామిని గాదుగదా. వేశ్యారత్నముగదా. దీనిం గూడిన తప్పేమి.

జయ—

చ. పలువురు నిందజేయుదురు • బంధువులందరుగూడి స్నేహితుల్
పలు పలు కూకలేయుదురు • భార్యయు చింతిలుచుండు నెల్ల వే
శలు ధనమూ వాలుశక్కి యగు • వారయతల్లియు దండ్రికోపమున్
నిలయము నందు జెందుదురు • నిందలపాలునుగాకు మిత్రమా.

ఉ. సుందరవేశ్య గూడుటయు • సొంపని యుల్లమునం దలంచియా
నందము జెందియేమి ఫలి • తంబును బొందెదవో శరీరమున్
గొందలపాటు జేసియును • గొప్పను బొందెదొ నేస్తకాండ్రచే
నిందలు జూడవైతి వికనిందుసభాంతరమందు మిత్రమా.

మరియు

ఉ. నిక్కనజన్ను గుబ్బలును • నిందునుబోలు ముఖారవిందమున్
జక్కనిమేని చాయయును • జల్తరు చీరెయుజూచి యున్నికా

టక్కులమారి మాటలును • డంబము కార్యములెల్ల మిత్రిమా
నిక్కము నిక్కమంచుమది • నీవునునమ్మియు మోసపోకుమా.

జ—మిత్రిమా నేను దానిం జూడమానుదమన్నను మదీయదృష్టి ప్రిసారంబులు వీడివచ్చుటలేదు. ఆహా యేమి సౌందర్యము

జయ:—మిత్రిమా నీవే యిట్టియజ్ఞానాబ్ధిలో బడుచుండ పామాన్యుల లెక్క యేమి.

సీ. ముఖముచంద్రుడటంచు • మోదమందెదుగాని
దిష్టిపిడతయంచు • దెలియవొక్కొ
కుచములు స్వర్ణంపు • గుండలందువుగాని
మాంసతిత్తులటంచు • మది నెరుగవొ
అధరపానంబెల్ల • నమృత మందువుగాని
విషపానమంచును • వ్వెరుగవొక్కొ,
మేనునుజూచియు • మేరువందువుగాని
మాంసపెము కలంచు • మది దలచవొ

తే. గీ. సుందరాంగి యటంచు నా • నందపడెదు
గాని వికృతాంగి యనుచును • గాన వొక్కొ
అట్టి నీచుల గూడంగ • నరుగబోకు
మిత్రిమా యికనైనను • మేలుకొమ్మ.

యిట్టి తుచ్ఛసౌఖ్యంబుల కాశించి చిన్ననాటనుండియు గడించిన కీర్తినంతను పాడుచేయదలంచితివా.

చం—స్వ॥ వీరల నిద్దర నెడబాపవలసినదని గదా రాజాజ్ఞగాన యియ్యుపాయంబుజేసి చూచెద. (అని మంత్రిపుత్రుని వైపు చేయి విసరిపిలచును)

జ—మిత్రిమా దానికేమిగాని యవ్వేశ్యారత్నము నిన్నుంచులకో గని చేయి విసరి పిలచుచున్నది. పోయి కనుగొనిరమ్ము.

జయ—(స్వ) ఆ కాంతను నేనెన్నడయిన చూచియుండలేదే. యిప్పుడు నన్నెందులకు పిలువ వలయును. యిదంతయు చిత్రముగానున్నది. యెట్లయినను కనుగొని వచ్చెద. (అని దగ్గర కేగును)

చం—మంత్రి కుమారా నమస్కారము.

జయ—శుభమగుగాక నన్నెందులకు పిలచితివో వేగ జెప్పుము.

చం—అయ్యా యింత తొందరపడియెదరేల మహారాజుగారికిని మంత్రిగారికిని కుశలమా

జయ—కుశలము గ కేమి.

చం—యువరాజుగారు కుశలముగ నున్నారా.

జయ—ఇవన్నియు నీ కెందులకు నన్ను బిలచిన సంగతేదియో జెప్పుము. నాకొరకు నామిత్రుండు వేచియుండును.

చం—తొందరపడియెదరేల చెప్పెద నాలి ఫును. మిక్కిలి రహస్యము.

జయ—ఆరహస్య మేదియో వేగ జెప్పుము.

చం—చెవినద్ద నోరుంచి ధాన్యపు గింజలో బియ్యపుగింజ. యీనంగి తెవ్వరికును దెలుపవలదు (అని నిష్క్రమించును.)

జయ—(కోపముతో) ఓసీ ఛండాలురాలా! ఏదియో గొప్ప రహస్యము జెప్పుదానివలె నటించి చివరకిదియా చెప్పితివి. ఆడుదానవు గావున బ్రాణంబులతో నేగగలిగితివి. లేనిచో నాకరవాలమున కాహారమ్ముగా జేసి యుందునుగదా. (అనుచు రాజపుత్రుని వద్దకు వచ్చుచున్నాడు)

జ—(తనలో) అదుగో మన్మిత్రుం డేతెంచుచున్నాడు. అవ్వేశ్య యెందులకు పిలిచెనో యడిగి తెలిసికొనియెద గాక (ముందుకు నడచి) మిత్రమా! య వ్వేశ్యారత్నము నిన్నెందుకు పిలచెను

నీ చెవివద్ద నేమేమో కొన్ని రహస్యములు జెప్పినది గదా. అవేవో నాకునుం దెలిపి నన్నానందపరుపుము.

జయ—మిత్రమా! చెప్పుట కేమున్నది. ధాన్యపుగింజలో బియ్యపు గింజ.

జ—అదేమి. అట్లనుచున్నాడవు. నిజము చెప్పుము.

జయ—ఇదివర కొకతూరి చెప్పితిని గదా ధాన్యపుగింజలో బియ్యపుగింజయని.

జ—అనగా నర్థమేమి.

జయ—నాకును దెలియదు.

జ—యేమి యిట్లబద్ధమాడెదవు. సిన్నంత ప్రియముగా బిలచి యేదియో రహస్యాంశము జెప్పక ధాన్యపుగింజలో బియ్యపు గింజ యని చెప్పునా.

జయ—మిత్రమా నీవద్ద నెన్నడయిన రహస్యము మరుగు పరచి యబద్ధమాడితినా.

జ—యెప్పుడును నాడలేదు గాని యిప్పు డాడితివి.

జయ—ఏమని

జ—ధాన్యపుగింజలో బియ్యపుగింజయని.

జయ—అదబద్ధమా.

జ—కాకమరేమి.

జయ—మిత్రమా యిట్టి దుర్భిప్రాయంబు నొందజెల్లునా.

జ—యేమి? మువ్వాటికిని యడిగెదా నిజము చెప్పవా. నిజమెరిగించని యెడ నిదియే నీకును నాకును కడపటి దినము.

జయ—నే నెరిగినంతవరకు నిజమిదియే.

జ—అహా యెంత సాహసించితివి.

తే. గీ. పామునకు బాలువోసిన • పగిదిగాగ
వేముల కమృతమును వోసి • పెంచినటుల
సఖుడవని నిన్ను నమ్మి మో • సమును జెంది
తిన్నినాళ్ళను దెలియక • హీనజనుడ.

ఇది మొదలు నీవు నాయెదుట నుండవలదు. నీయట్టి యసత్యవాది ముఖంబేరు జూడజాలగాన నాయెదుట నుండి తొలగిపొమ్ము.

...యు—మిత్రమా నేనించుకంతయు యసత్యము బలుకి లేదు. ఒకవేళ-

తే. గీ. వారసుందరి నాతోడ • పలికినట్టి
సంగతుల నించుకైన నీ • సన్నిధాన
మునను జెప్పకయే గప్పి • పుచ్చితేని
తల్లితో బొందు పాపంబు • దగులు గాక.

...—(స్వ) ఆహా యేమి యిట్టి ప్రమాణంబులు సలుపుచున్నాడు. నిజముగా వేశ్యయిట్లే పలికినదేమో ఆ, యెందుల కిట్లు పలుకును యెంతో పరిచయమున్నదానివలె పిలచి యేమేమో కొన్ని రహస్యములు చెవికడ జెప్పి నవ్వుచు వెడలిపోయె గదా. గాన యీతడే యారహస్యము మరుగు పరచుచున్నవాడు (ప్రకాశముగా) ఓరీ యసత్యవాదీ ప్రమాణంబులు సలిపినంతమాత్రముననే నిన్ను నమ్మెద ననుకొంటివా. అన్నిటికి తెగించిన నీయట్టి క్రూరున కీప్రమాణంబు లేమి చేయగలవు. చాలు. చాలు. యీపాటికిట నుండి తరలుము.

...యు—

తే. గీ. ప్రాణమిత్రమ నేనుర • వంతయయిన
సత్యమును దప్పలేదయో • సన్నుతముగ

గాన క్రోధంబు బోద్రోలి • కరుణఁ గోడ
గావుమీ నన్ను పూర్వపు • గౌరవమున.

(అని పాదంబులపయింబడి పాదపద్మంబుల కన్నీటిధారలచే దడుపుచుండును.)

జ—(పాదములు విదలించుకొని) ఓరీ కూౖరాత్మా నీగుణంబు లన్నియు నాకు నేటికిఁ దెల్లంబాయె. ఊరకున్న కొలది నోటికి వచ్చినట్లనుచున్నావు. నీయట్టి కూౖరాత్ముని ముఖంబు మాయట్టివారు జూడఁ జనదు. నీవే ప్రాణమిత్రుఁడవని నమ్మి యింతకాలంబును నీమైత్రినే గోరి అత్తవారి యింటి కరుగుట మానితి. చాలు చాలు నీమైత్రి. యికనయిన భార్యను జూడ బోయెద.

(అని నిష్క్రమించును)

జయ—అహా! లోకమున నెంత లెంత వింతలు ఘట్టుచున్నవి. చిన్నతనమాదిగా ప్రాణమిత్రులమై యొకకంచమున దిని యొక మంచమున బరుండు మాకిట్టి యెడబాటులబ్బెగదా ఇంక పురంబున కేగినచో ప్రజలచే నిందలు తల్లిదండ్రులచే ననాదరణయుంగలుగుగావున పట్టణంబునకు బోను. రాజపుత్రుండత్తవారింటికికదా పోయెదనని వాక్రుచ్చెను. గాన నాతని వెనుమడించియే యుండెద (అని శరీరమువంకఁ జూచి) నామిత్రుఁడే నన్నెడబాసినప్పుడు నాకీవస్త్రాభరణంబులేల. (అని తీసివైచి కాషాయవస్త్రంబులందాల్చి) యియ్యదియే నావేషమునకు దగినది. నామిత్రుడీపాటికి కొంతదూరమేగియుండును. నేనాతని కగపడకుండ నాతని వెంబడించియే యేగెద.

(అని నిష్క్రమించును.)

(తెరపడును)

ప్రథమాంకము-సంపూర్ణము.

---



శ్రీరస్తు

శ్రీయాజ్ఞవల్క్య పరబ్రహ్మణేనమః

# జయంతజయపాలము



## ద్వితీయాంకము

### ప్రథమరంగము—పుష్పవనము

ప్రవేశము—కమలవతి, కళావతి

కళా—చెలీ! కమలవతీ నేటిరోజున నీముఖకమలంబిట్లు వాడియున్నదేమే!

క—(లేని వికాసము ధరించి) యేమీ నామోమిదివరకున్నరీతిని లేదా.

కళా—లేదు. యేమంటివేని యిదివరలో యెన్నడు నీముఖకమలము జూచినను శరత్కాలచంద్రమండలముం జూచినట్లుండెడిది. యిప్పుడన్నో కృష్ణపక్షాంతమందలి తారాపతివలె క్షీణించియున్నది.

క—(తనలో) నారహస్య మీమె తెలుసుకొనెనాయేమి. (ప్రకాశముగా) చాలు చాలు నీవాక్చాతుర్యమునకు సంతసించితి. యీరోజున నాదేహమందేలకో సుస్తీగాయున్నయది. అంతియే గాని వేరొండు కారణమేమియు లేదు.

కళా—ఇన్నిదినములనుండియు లేనిబాధ ప్రాణేశ్వరుం డేతెంచెనని విని యీదినముననే వచ్చినదిగాబోలు.

క—(తనలో) యేమీ యానీచుడా నాప్రాణేశ్వరుండు. చిన్నతనముననుండియు ననుప్రేమించిన మేనరికన్నిగాడే నాభర్త

(ప్రకాశముగా) కోపముతో యిట్టియసంబద్ధ ప్రలాపము లా డకుము. జాగ్రత.

కళా—చెలీ యింతకోపగించుటకు యే నేమితప్పుమాటాడితిని.

క—ఇంతకంటె తప్పేమిగలదు.

కళా—నీ పెనిమిటి వచ్చినాడనుట దోసమా?

క—కాదా.

కళా—పోనిమ్మ నా కేమి. వచ్చినాడుగనుక చెప్పితిని. నీకిష్టములేని యెడల యికముందెరిగింపనులే. (ప్రక్కకు దృష్టినిలపి) అరుగో యెవరోవచ్చుచున్నారు. (నిదానించి) యెవరోయనుకుంటిని. నీభర్తయగు జయంతుడే వచ్చుచున్నవాడు.

క—(మెటికలువిరచి పైకి సిగ్గునభినయించి) (తనలో) యేమీ యీ దుర్మార్గు డిక్కే వచ్చుచున్నాడు. యిప్పుడు నన్ను బలాత్క రించునా యేమి.

జ—(ప్రవేశించి) ఆహా నాప్రాణేశ్వరినిమిత్త మెన్నియో సౌధం బులు తిరిగి తిరిగి వచ్చితినిగాని యెచ్చటను నగుపడలేదు. (ముందుకు జూచి) యేమీ యిచ్చటనే యున్నది. ఆహా యేమియందము. యింతకాలమును ఆదురాత్ముని మిత్రునిగా నమ్మి నాయీమందయాన పొందు నొందజాలనైతి. యిప్పు డైనం దరిజేరి కౌగిటజేర్చి మదనసామ్రాజ్యంబు జూరగొం దుగాక. (అని ముందున కేగును)

క—(తనలో) అయ్యో! యీకౄరాత్మకు నాకు మానభంగము జేయునా యేమి.

కళా—మహారాజకుమారా నమస్కారము. చెలీ నీభర్త పాదార విందములకు నమస్కరించి దీవనలువడయుము.

క—(ముఖము చిట్లించును.)

జ—కళ్యాణము కాగాక.

కళా—రాజకుమారా అయ్యాసనము నధిష్ఠింపుము (తనలో) యీతని పేరు విన్నమాత్రముననే కోపము నొందుచున్నయది. నమస్కరించ మనిన ముఖము చిట్లించుచున్నయది. దీని కీతనితోఁగూడి సౌఖ్యములుబొందు యోగము లేదు కాబోలు. నే నేమిచేయగలను. నే నిప్పుడు వీరల విడిచిపోయిన బాగుగ నుండును. (అని తెరలోనికి నిష్క్రమించును.)

క—(తనలో) అయ్యో యెంత మోసము సంభవించెను. వీనివాతఁబడితిని. ఇటనుండి తప్పించుకొను నుపాయంబెయ్యది. (అటునిటుచూచి) చెలియగు కళావతి యేగెనుగాబోలు. నేఁగూడఁ బోయెద. (అని తెరలోనికిపోఁబోవును.)

జ—(హస్తము పట్టుకొని) ఓనవమోహనాంగీ మనోహారిణీ నీయపురూపసౌందర్యము నాహృదయారవిందంబు నానందంబు నొందించుచున్నయది. ఇంతకాలమునుండియు నీసౌందర్యమును జూడక యుపేక్ష జేసియుంటిని. ఓ ప్రాణనాయకీ నన్నేలుకొమ్ము. నే నీదాసుండను. నన్నామదనసామ్రాజ్యంబున కభిషిక్తుంజేసి రక్షింపుము. (అని దగ్గరకు లాగును)

క—(చేయి విడిపించుకొని తనలో) ఓరీ నిన్ను మదనసామ్రాజ్యమునకుమారుగా యమలోకసామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుం జేసెద.

జ. ఉ॥ ఓరమణీమణీ యకట • యూరక నన్నిటు బాధపెట్టగా
నేరము లేమి జేసితిని • నేడెగదా నినుగూడ వచ్చితిన్
సారసలోచనా యిపుడు • సయ్యన కౌగిట జేర్చి నన్ను శృం
గార రసాంబుధిన్ మునుగ • గా కరుణింపుము నిన్ను వేడెదన్.

(మరలహస్తమును బట్టిలాగి) ప్రేయసీ! నే నీమన్మథ తాపము నకోర్వజాల. నీమోవిపానకము నిచ్చి బ్రతికించుము.

క—(మరల చేయివిడిపించుకొని దూరముగా నేగినిలచును)

జ—ఓప్రాణనాయకీ ప్రాణనాయకీ (యనుచు వెంబడించి పట్టుకొనబోవును)

క—(తనలో) పారిపోవుటకి దే మంచిసమయము. (అని తెరలోనికిపారిపోవును)

జ—ఆహా! నాప్రాణేశ్వరీ యెంతలో మాయమయితివి. ఇది నీకుతగు నా. నన్నిటనొంటరిగా విడచియేగితివా.

సీ॥ రాజీవ నేత్రిరో • రాజాత్మజునినన్ను
విరహము పాల్జేసి • వెడలినావ
కమలాయతాక్షి నీ • కాంతుడ నగునన్ను
దుఃఖము పాల్జేసి • దొలగినావ
సారస నేత్రిరో • సజ్జనవాతుసన్
మోహాబ్ధిలోముంచి • బోయినావ
చంచ లాక్షిరొనీదు • నన్నధిగోర్న న్ను
మాయ మాటలు జెప్పి • మరలినావ

తే॥ గీ॥ కటకటా యిట్టికష్టము • ల్గలుగ జేసి
మందయానరో నీదగు • పొందుగోరు
నన్నువిడనాడి పోతివా • నన్నుతముగ
మబ్బులో దూరుచందురిని • మాడ్కిగాగ.

అకటా! యీవిరహ తాపమెట్లు భరియింతు.

ఉ॥ ఎంతని యోర్తునారమణి • యేమెడ కేగెనొ గాంతునన్న నా
వంతయు దారిగన్పడదె • వాడును జూపడికేమి సేయుదున్

కాంతనుబాసి యొక్కత్రుటి • కాలమునైన సహింపజాలనే
చింతను బోదునెవ్వరిట • చెప్పెడివారలు దైవమొక్కడే.

సఖినన్నిట్లు మోసపుచ్చుట నీకుభావ్యమా. ఏమినావెర్రి. సద్గుణఖనియగు నా కాంతనన్ను వీడబోసాహసించునా. యీసమీపమునందే యుండవచ్చును గాన యీవృక్షజంతువుల నడిగెదగాక (వానింగాంచి)

సీ॥ కమలాక్షి జూపరే • కరులారతరులార
హరులార దయతోడ • హంసలార
పద్మాక్షిజూపరే • బహువిధపాటల
వినిపించుచుండెడి • పికములార
జలజాక్షి జూపరే • జలజాతముల నుండు
తేనెపానము జేయు • తేటులార
శుకవాణి జూపరే • పికసంతతులపాట
వినిసంతసించెడి • విహగులార

తే॥ గీ॥ కుందరదనను జూపరే • గూబలార
మారుబాణను జూపరే • మధుపులార
చంచలాక్షిని జూపరే • చంచులార
సుందరాంగిని జూపరే • చుక్కలార.

ఏమినామందమతి ఈమెనన్ను గాంచుట క్రొత్తగావున సిగ్గుపడియుండవచ్చును. అందుచేతనే వెడలిపోయినది. మరల నాముద్దుగుమ్మ చెలికత్తెల ప్రోత్సాహముచే నన్నానందింప జేయనే తెంచును. అంతవరకామందిరంబున శయనించెద. (అని నిష్క్రమించును.)

ద్వితీయరంగము—మేనరిగూడెము సమీపము

[ప్రవేశము—కాషాయవస్త్రధారియై జయపాలుడు]

జయ—(స్వ) కటకటా ప్రపంచమున నెంతలో నెట్టిమార్పులు బుట్టుచున్నవి. నిన్నటివరకును నాప్రాణమిత్రునిం గూడి కేళీ

విలాసంబులు సలుపుచుంటినిగదా. ఇంతలోనే మామైత్రిలత తెగ్రింపబడవలయునా. విధినేమందును. మహారాజసుతుని తో సమానసౌఖ్యంబుల ననుభవించుచు విలువగల వలు వలు ధరించు నాకీ కాషాయివస్త్రంబులా గట్టవలె? నా భాగ్యంబులు. హంసతూలికా తల్పంబున మిత్రునితో శయనించు నాకీ కటికి నేలయూ శయనించుటకు శరణ్యము. అహాదైవము నాతని దూరుదును. అక్కటా ప్రాణమిత్రమూ నాయందే దోసము కనిపెట్టి నన్నిట్లొంటరిం జేసితివి. ఇదివరకెన్నడైన నీయొద్ద నసత్యమాడితినా. ముందువెనుక లాలోచింపక నన్నిట్లు చేయుట న్యాయమా (ఆలోచనమభినయించి) ఏమి నామంద బుద్ధి నన్నేకవిధముల దూషించిన నాని నే విషనకరక్షింపు మని యాచించుటయా. ఆ. అట్లుకాదు శిష్యుకయెన్నిదినము లకైన యెన్నికష్టములు బొందినయైన నాతని మైత్రిత్వమును బొందుటయే నానిశ్చయము.

చ. చినతనమాదిగానను • శేషకృపారసదృష్టిజూచుచున్
మనమున నించుకైనసను • మానమునాయెడనిన్నినాళ్లుదా
గనివినియుండలేదుయొక • కొంతముఖంబునగోపమొందనన్
గినిసిపరిత్యజించుటలు • గేవలమూర్ఖపరిసంగముల్గదా.

(ఆలోచన మభినయించి)

సీ. ఆవారకాంతదా హ • స్తముసాచినన్
వేరమ్మటంచును • బిలువనేల
బిలిచెబోముందువె • నక్కలనుజూడక నేను
వేగదానికడకు • నేగనేల
నేగినవదిధాన్య • పుగింజలో బియ్య
పుగింజయనిచెవి • మూల్గనేల

మూర్ఖైనుగోయది • ముఖ్యమిత్రుమునన్ను
కారణంబేమని • గోరనేల

తే. గీ. గోరినంతనే వానికి • కూర్మిమిత్రోడ
నడచినట్టిప్రసంగంబు • నుడువనేల
నుడువగా దానినమ్మక • వీడినన్ను
బాసిపోనేలబలుపాట్లు • బరచనేల.

ఇవంతయు నాపురాకృతకర్మఫలంబనుభవింపకతీరునా. (చంద్రముఖి నుద్దేశించి) ఛీఖలటా. చండాలినీ.

తే. గీ. మిత్రవర్యుల మగువమాను • మైత్రిలతను
త్రెంపివేయగనేలనే • యింపుమీర
కటకటా యెన్నడైనసీ • కపకృతంబు
సలిపినారమె యోసిభం • డాలురాల.

జననమందినదాదిగా నీకెన్నడయిన నపకారము జేసియుంటిమా మమ్ములనిట్లు వేరుజేయునీకేమిలాభము సంభవించె. నీకేమయిన గోరికయున్నయెడల మమ్మడిగిన తీర్పకుందుమా (ఆలోచించి) యేమినావెఱ్ఱి. జరిగినదానికి చింతించుట గతజలసేతుబంధనమని పెద్దలువక్కాణింతురు. దైవఘటనయెట్లున్న నట్లగుగాని వేరొక రీతిజరుగునా (ఆకసమువంకదృష్టినిలిపి) అప్పుడే రెండుయామములుగావచ్చినది నిద్రవచ్చుచున్నది. (అని ప్రక్కపై కూర్చుని) (దూరమున జూచి) ఆహా యేమియీవింత యింతయర్ధరాత్రిసమయమున సహాయమెవ్వరులేక భీతిలేక విలువగల వస్త్రాభరణంబులధరియించి మూర్తీభవించినసౌందర్యదేవతయో యనునట్లు హస్తిగమనంబున యేతెంచుచున్నయీకాంతారత్న మెవ్వరైయుండును. యెవ్వనికొరకై యుండును. యెవనినిమిత్తమైననేమి. దీనిరాక జూడజూడనాకనుమానము గల్గు

చున్నయది గాన నే నీమెకు గానరాకుండ దీని యుదంతంబారసెద (అనియొకప్రక్కకొదిగి నిలచును)

క—(ప్రవేశించి) (నభోభాగమును జూచి తనలో) అబ్బో అప్పుడే రెండు యామముల రాత్రియయినది. గాన నేనీరోజున వచ్చు టాలస్య మైనదని నామేదరనాయకుడు కోపగించునేమో. కోపగించినచో యీరోజున నాభర్తయే తెంచెననియు, అందుచే నేవచ్చుట కాలస్యమయినదనియు చెప్పి యొప్పించెద (అని నిష్క్రమించును.)

కన్ని—(ప్రవేశించి తనలో) ఆ యేమి రెండుయామముల రాత్రియయినను రాలేదు కారణమేమయియుండును. వచ్చుచుండ మార్గమున నెవ్వరయిన జూచి మాగుట్టురాజున కెఱిగింప లేదుగదా యేమిప్రమాదము మూడుతో రాజునకు దెలిసినచో నాప్రాణంబులు దక్కుటరుదు గుట్టుబయలెక్కినచో జీవంబులుండవు. ఇకనయిన బుద్ధిదెచ్చుకొని యీపాడు వృత్తిమానెద. యేమీ మానదలచుచుంటినా. యెందుకు మానవలయు. ధనమా మిక్కుటంబుగా జిక్కుచున్నది. అదిగాక తనంతనే జిక్కినకన్నెను విడచుట చేజిక్కినపక్షిని విడుచుట కాదా. యేమయిననుసరియే నామేనిజీవంబులున్నంతవఱకు నేనా ముద్దుగుమ్మను విడచియుండలేను (అని ప్రక్కకుచూచి) అదుగో నాబంగారుబొమ్మ, నా ఆనంద దేవత వచ్చుచున్నయది.

క—(ప్రవేశించి) అదుగో నామేదరినాధుడు అప్పుడేవచ్చి నాకొరకు వేచియున్నాడు. (సమీపించి) మేదరినాయకా నీసేవకురాలు కమలవతి నమస్కరించుచున్నది. గైకొనుము.

జయ—(స్వ) ఆహా వీడెవడు యీమెయీతనివద్దకు వచ్చి నమస్కరించుచున్న దేమి కారణము. ఇదంతయు చాలా చిత్రముగా నున్నదే.

కన్ని — నాముద్దుగుమ్మా నా బంగారపుబొమ్మ లెమ్మ (అని లేవదీసి) చెలీ నేడింత యాలస్యమగుటకు కారణమేమి?

జయ — (తనలో) యీమె రాజకన్యకామణివలె నున్నది. వీడు మేన రివలె నగపడుచున్నాడు. వీనిని నాథాయని బిలుచుచున్నదే మి కారణము. తినబోవుచు రుచినడుగనేల యీమె వాని ప్రశ్నకు త్తరమేమి చెప్పునో వినియెదగాక.

క — ఓనా మేనరి నాయకా యీరోజున నాభర్త వచ్చినాడు. అతని మోసపుచ్చి వచ్చుట కింత యాలస్యమయినది. రక్షింపుము

జయ — ఇప్పటికి గొంత గొంత తెలియుచున్నది. నాభర్త యీరోజుననేగదా వచ్చినాడని చెప్పినది. యీదినమున వచ్చినవాడు మన్మిత్రుడగు జయంతుడుగదా. యీమె నామిత్రుని భార్యయై యుండును.

(కమలవతి నుద్దేశించి)

తే. గీ. భువిని రాడ్వంశమందున • బుట్టి విమల
కీర్తియుతుడైన జయంతుని • గేలువట్టి
మోహపాశమునందున • మునిగియిటుల
జేయదగు నోకో కాంతరో • సిగ్గు విడచి.

తే. గీ. బుట్టలును చేటలును నల్లి • పొట్టనింపు
కొనుచు నుండెడి మేదరి • వానినీవు
అమల గుణలోలుడైన • జయంతు కంటె
సుందరుండని యెంచితే • సుందరాంగి.

యిట్టి తుచ్ఛభోగంబుల కాసించి యీనీచుని జేరదగునా!

కన్ని — కాంతా నీభర్తయగు జయంతుడేనా వచ్చినది. అట్టి నవ మన్మథాకారుండగు సుందరుండు మందిరంబుననుండ బొందు మాని నాచెంతకు వచ్చుటజూడ నాపురాకృత కర్మఫలంబు

గదా ప్రేయసీ మరచితిని. నీభర్త నెట్లు మోసపుచ్చి యేతెంచితివో నాకుం జెప్పి ధన్యుం జేయుము.

జయ—వీనిమాటలబట్టి జూడ మన్మిత్రుండగు జయంతునిభార్య యే యని చెప్పనక్కరలేకయే చెప్పుచున్నది. ఓసీ జారిణీ యౌవనమదాంధురాలవై యిట్లుండ దగునా.

తే. గీ. యౌవనమదంబుచే నిను • మంతయైన
కన్నుగానక కామాంధ • కారమందు
బడియు భర్తను విడనాడి • పరపురుషుని
జేరి చరియించు టొప్పునే • సిగ్గులాడి.

క—నాయకా యీదినసాయం సమయమున నేనును నాచేటియయిన కలావతియు మనీయ్యాంతగపురప్రాంత పుష్పవనంబున విహ రించుచుంటిమి.

కన్ని—తరువాత

జయ—(తనలో) యీామె కరి యడిగిన ప్రశ్నకు త్తరముగా యీాయతివ తననాధుని మోసపుచ్చుటను గురించి చెప్పుచున్నయది. సావధానుండనై వినియెద.

క—అంత నా కాంతుడెచ్చటనుండియో యే తెంచె. అంత నాచెలి యగు కళావతినన్నువిడచి నేనెరుగకుండ సాగిపోయె. అంత నాతడు మోహాంధకారంబున బడి కన్నులుగానక నన్నుబలాత్కరించబోవ నాపతివ్రతాత్వమునకు భంగము గలుగునని వానికిచిక్కక పరుగు పరుగున యిటకు వెడలి వచ్చితి.

కన్ని—సెహాభాస్ సెహాభాస్ మంచిపని చేసితివిగాని యింకనీవు నావద్దకు రావలదు.

క—యెందుచేత?

క—నీభర్తవచ్చిన హేతువుచేత

క—నాథ ర్త యేకాదు. బ్రహ్మాదులు తల్లక్రిందుగా తపస్సుజేసిన ను నిన్ను విడచియొక్క త్రుటికాలమయిన నుండగలనా.

కన్ని—కాంతా నేడో రేపో నీభర్త నీయత్తవారింటికి తీసికొనిపో వునుగదా అప్పుడేమి చేయుగలవు?

క—నేనేదియైన బొంకి తప్పించుకొనియెద.

కన్ని—ఇప్పటికి బొంకెదవను కొనుము.

తే. గీ. ఎన్నటికినైన నిన్ను నీ • కన్నవారు
యత్తవారిల్లు జేరంగ • యంపకుండ
నుంతురాగాన నన్విడి • యువిదమిన్న
పతిని జేరి సుఖంపుమీా • కుతుకమలర

క—నాథా! నన్నింత చులకనజేయ మీాకు భావ్యమా?

తే. గీ. కరుణతో బాల్యమాదిగ • గాచినాడ
వమలగుణనిధి యగుచుం జే • ర్వడసినాడ
వౌరమేదరి నాయకా • యట్టినిన్ను
నిముసమయినను విడచినే • నేగగలనె

గాన మదీయ కోర్కె తిరస్కరింపక నీకడనున్న కరవాలము నా కొసంగుము. నేవాని యంత మొందించి వచ్చెద.

జయ—(తనలో) సుతిమించి రాగమున బడుచున్నయది.

ఉ. జారిణిప్రాణనాథునిల • జంపియు మేదరివాని గూడి యిం
పారసుఖంబుల న్గనుచు • బాగుగ సౌఖ్యము నొందగోరి యీా
కూరిరుని కత్తినిమ్మనుచు • గొంచెము మైనను జంకులేక నీ
కారులు బల్కు నిన్నిపుడు • ఖండనజేసిన బాపమున్నదే.

కన్ని—నీభర్తనంత మొందించినచో మన గుట్టు లోకమునకు వెల్లడి గాకుండునా తెలిసినచో మన ప్రాణంబులు దక్కుటబద్ధము గాదా.

క—ఓయీ నాచేయువని రెయిరుల కెరుగదరమా. రహస్యముగ జంపెద. నీవేమియు ననుమానంబు నొందక ఖడ్గము నాచేతి కిమ్ము నేబోయి వచ్చెద.

కన్ని—(తనలో) ఈవధయెట్లయిన బయలెక్కినా ముమ్మాటికిని నాప్రాణంబులు దక్కవనుమాట సత్యము. గాన యీవధో ద్యోగము మానుమని చెప్పుదునా. చెప్పిన నాకీకాంత దక్కుటబద్ధముగదా. యీసుందరాంగి లేనిచో నేజీవించుట దుర్లభము. దైవఘటన యెట్లున్నట్లగు (ప్రకాశముగా) కాంతామణీ! యిదుగో నాఖడ్గము. దీనితో నీభర్త శిరము ముందు వెనుకలాలోచింపక గొబ్బర వుచ్చివలె నెగరగొట్టి రమ్ము. (అని కత్తి నిచ్చును)

జయ—(కోపముతో తనలో)

శా. ఓరీ మేదరి దుర్మదాంధమదిలో • నూహించకింతేనియుఁ
మారాకారుని దుష్టశిక్షకుని కా • మాంధంబున న్గాలి యీ
నారీరత్నము జంపగాదలచి ని • న్నర్థింప ఖడ్గంబునిం
పారఁ మోహము వీడలేక తులువా • పాపాత్మకత్తిచ్చితే.

నిన్ను జంపిన లోకంబునకు హితంబుగాని అహితంబుగాదు.

క—ఓయీ మేదరి నాయకా ఒక్కనిముషములో నన్నియు తీర్చి వచ్చెద చూచుచుండుము.

కన్ని—ప్రియురాలా రహస్యంబు బయలు పడనీయవలదు సుమా.

క—నేనంత వెర్రిదాన ననుకొంటివా యేమి ఇక నావనిమీద పోయెద.

కన్ని—నాయకీ నాకత్తి మాత్రి మెచ్చటనైన మరచిపోకుమా జాగ్రత నీవీకృత్యము నెరవేర్చితివేని బ్రతికి యున్నంతకాలము సుఖముగా సౌఖ్యంబుల ననుభవింపవచ్చు.

క—అల్లే రొయనర్చెద లెమ్ము. (అని నిష్క్రమించును.)

కన్ని—ఈమె యీావని తప్పక నెరవేర్చును. అప్పుడు నాకు పూర్వపు సౌఖ్యము కన్న నెక్కుడు లభించును. నిద్రవచ్చు చున్నది బోయి పరుండెద.

(అని నిష్క్రమించును)

జయ—ఆహా కలికాల మహిమ లెట్లున్నవి.

సీ. కూటసాక్ష్యము లిచ్చి • కులములదిగముంచు
బాధకు లెందరో • ప్రబలినారు
సజ్జనులకు హాని • సలుపుచు బాధించు
వేనవేల్దుష్టులు • వెలసినారు
న్యాయమన్యాయంబు • లరయక శిక్షించు
భూనేత లెందరో • బుట్టినారు
విద్యనంతయు నేర్చి • పిదప గురుద్రోహ
మొనరించు శిష్యులు • జననమురి.

తే. గీ. పరవనితలను జూచియు • పాడుజేయు
కామవిహారు లెందర్లో • కలిగినారు
గొప్పయుద్యోగమూసించి • కులసతులను
భంగపరచెడి నీచులు • వరలినారు

పురుషుల గుణంబులు జూడ నిట్లున్నవి. ఇక స్త్రీలన్ననో,

సీ: నగలు తేలేదంచు • మగని సాదించెడి
కమలాక్షు లెందరో • కలిగినారు
అందెలు కడియము • లందముగావని
బెట్టమూనెడి సతు • ల్వెరిగినారు
సంసారమును వీడి • సానులై చరియించు
నలినాక్షు లెందరో • వెలసినారు

వరకాంతు రతిగోరి • ప్రాణేశ్వరుని వీడు
పోలతుక లెందరో • పుట్టినారు.

తే. గీ. అదియుగాకను నేడు ప్ర • త్యక్షముగను
పరుని గోరుచు తన ప్రాణ • పతిని జంప
దలచుకాంతను జూచితి • దైవమాయ
కాంతలెంతకై నను జాల • గలరుగాదె.

ఆహా కాంతామణీ యెంత పని చేయదలచుచుంటివి.

కం. నిను నీవతి గుణవతివని
మనమున దలపోసె గాని • మాయలనెల్లన్
గనుగొని యుండ డహాయో
వనితామణి యట్టి పతిని • వధియింతువటే.

(ఆలోచించి) నా మిత్రునికి భార్య హస్తమున ప్రాణములు బాయుటకు విధిలిఖితమయియున్నదా యేమి యెట్లయిన నా ప్రాణ మిత్రుని గాపాడి సద్యశము నందవలయు గావున నేనీక్షణంబున నీమె వెంటనే యరిగి మిత్రుని వధింప కుండ నవవారించెద గాక.

(అని నిష్క్రమించును)

తృతీయరంగము—అంతఃపుర సౌధము
ప్రవేశము—ఖడ్గముతో కమలవతి

క—(తనలో) నేడెంత ఘోరకృత్యము జేయ దలంచితిని. దైవ సమానుండును, సుందర వదనారవిందుండును, నిరంతరము నన్నే నమ్మియున్నవాడును, రాజాధి రాజకుమారుండును యగు ప్రాణేశ్వరుని జంపదలంచుచుంటినే. యెంత పాపమున కొడిగట్ట బోవుచుంటిని. యీతని జంపినచో నేవిధవనుగానా? విధవనయినచో పరులముఖంబును జూడగలనా? ఛీ, యిట్టి పనిచేయనొల్ల. యిది లోకంబునకు వెల్లడిగాదా.

వెల్లడియయిన నే జీవించి యుండగలనా! (ఆలోచించి) యేమంటిని. వధింపకూడదనియా. వధింపనిచో నేడో రేపో యితఁడ త్తవారింటికి గొనిపోవును గదా. అట్లయిన నామేదరి నాయకుని పొందెట్లు లభించును. లభించని పక్షమున భూతలంబున క్షణకాలమైన జీవించియుండగలనా. యెట్లయినను వధించితీరెద. (అని కత్తినెత్తి దగ్గర కేగి) ఇట్టి నవమన్మథాకారు నెట్లు వధింపుదు. యెట్లయినను తప్పదు (అని కత్తి సవరించుచు) అయ్యో నాశరీరము కంపమెత్తు చున్నదే. చేయివణకుచున్నదేమి! (ఆలోచించి) ఆలస్య మమృతం విషం అనునార్యోక్తి రీతిగా ఆలస్యము చేసిన యెడల యేరైన వచ్చినాపని కాటంకము గలుగజేయుదురు. (అని జయంతుని శిరము నరకును)

జయ—(ప్రవేశించి) ఆగుమాగుము. పరపురుషునిపై యాసచే ప్రాణనాథు నిట్లు వధింపనగునే. ఛీ పాపాత్మురాలా దుర్మతీ. మన్మిత్రుని నేవచ్చునంతలోనే యంత మొందించితివా. కుల ఘాతినీ నిన్నువధించినను పాపమిసుమంతయు లేదుగదా.

క—(నివ్వెరపడి) యిప్పుడూరకున్న మోసముసంభవించుగాన యీ నేరము వీనిపై మోపెద.

ఉ. క్రూరుడ దుర్మదాంధమది • గొంచెముయైనను భీతిలేక నీ
సారసనేత్రు మత్పతిని • సయ్యనవచ్చియు నిద్రనుండ యీ
తీరున కత్తిచే దునిమి • తే హార యెంతటిపాపకార్యమో
పారుడ నీవెవండవుర • పాపమునంతయు గట్టుకుంటివా.

జయ—

తే. గీ. పాపినీ పరుని బొందంగ • పతినిజంపి
కరుణయింతయులేక యా • నేరములను

అడ్డువచ్చిన నామీద • నాపినావు
కులటరో యెట్టిమాయలు సలిపినావె.

(క్రిందుజూచి) ఛీ కులఘాతినీ, యెట్టి దుర్మార్గంబున కొడిగట్టితివి. నీచకులుండయిన యామేకరినిగూడి యిహసౌఖ్యంబు లంద దలంచితివా నీకృత్యమెవ్వరును జూడరనుకుంటివా పుట్టిన యింటికిని మెట్టినయింటికినిగూడ దుర్యశం బొనగూర్చితివి. దురాత్మురాలా నిన్ను కరకుకరవాలముం జేకొని ఖండ ఖండంబులుగ గోసి కాకులకె పరవయిచినను దోసములేదుగదా.

(జయంతునుద్దేంచి)

తే. గీ. రమ్యగుణభోజసుందర • రాజరాజ
కులటయగు భార్యచేతిలో • కోర్కెవీడి
ప్రాణములుగోలుపోతివా • ప్రాణసఖుడ
నిన్నువిడనాడి క్షణమైన • నిలువగలనె.

హా ప్రాణమిత్రమా చిన్ననాటనుండియు నన్నెంతో ప్రేమతోజూచుచు నన్నువీడి కులటయగు భార్యచేతిలో ప్రాణంబులు బాసిపోతివా. నిన్నువిడచి నే నెట్లుజీవించి యుండగలను. నే నెన్ని చెప్పినను వాని నన్నిటిని పెడచెవింబెట్టి యిచ్చటకే తెంచి ప్రాణంబుల విడచితివా.

క—(తనలో) నే నిప్పుడూరుకున్నయెడల నేరమునాయందు మోపబడును. ఈతడెవ్వడో సన్యాసివలెనున్నాడు. మిత్రమాయని దుఃఖించుచున్నాడు. నాభర్తకు మిత్రుండై యుండనోపు. నేరము వీనిపై నుంచనలయు గాన యొకయుక్తిపన్నెద. (ప్రకాశముగా) హా తండ్రి హా రాజభటులారా యెవ్వడో యొక్క దురాత్ముండు మదీయసౌధముంజొచ్చి నిదురించుచున్న నాభర్తను చంపినాడు. రండురండు. నన్నుగూడవధింప

నుద్యమించుచున్నాడు రక్షింపుము. (అని కేకలువేయును)

(రాజుప్రవేశించి) యేమిటింత యర్ధరాత్రి సమయమున నాకుమారి “యెవరో చంపుచున్నారు, రక్షింపు”డని పిలచుచున్నది. (ముందున కరిగి ప్రకాశముగా) పుత్రీ! ఆదురాత్ము డెచ్చటనున్నవాడు.

క—తండ్రీ! అడుగో ఆమంచము వద్దనే యున్నాడు.

రా—ఔరా! మాయవేషధరా! పాపీ నాయల్లుండు నీకేమి యపకారము చేసెనని జంపితివిరా.

జయ—(తనలో) ఆహా యీకులట యెట్టిమాయలు పన్నినది. (ప్రకాశముగా) మహారాజా! నీయల్లుని వధించినవాడను నేనే. (అని ముందుకువచ్చి) నన్నుగూడ నీయల్లునితో పాటము రపురి కంపుము. యోచింపకుము.

రా—ఏమిా యీతడించుకంతయుజడియక జవాబుచెప్పుచున్నాడు. ద్రోహియయినట్లగపడుటలేదు. ఐనను రేపుదయమున విచారించెద. (ప్రకాశముగా) భటులారా! రండు.

(భటులు ప్రవేశించి) మహారాజా యేమిసెలవు.

రా—మిారీద్రోహిని కారాగారమున నుంచుడు, యీద్రోహము రేపు విచారించెద. (అని నిష్క్రమించును.)

భ—ఓరీ ద్రోహీ! కారాగారమునకు నడువుము. (అని జయపాలునితో నిష్క్రమింతురు)

క—నే పన్నినమాయలో నాజనకుడు పడినాడు. ఇక నాకేమియు భయములేదు. చాలారాత్రి యయినది. నేబోయి నిద్రించెద.

(అని నిష్క్రమించును)

[తెరపడును]

ద్వితీయాంకము సంపూర్ణము



శ్రీరస్తు.

శ్రీయాజ్ఞవల్క్యపరబ్రహ్మణేనమః

# జయంతజయపాలము

## తృతీయాంకము

### ప్రథమరంగము—కారాగృహసమీపము.

ప్రవేశము—వసంతుడు

వ. (తనలో) ఆహా యేమి ఆశ్చర్యము. నిన్నటి రేయి మదీయపితృ గృహంబున భార్యాభర్త లిరువురు శయనించి యుండిరట. అంత నెవ్వడో సన్యాసివేషధారి యొకడు వచ్చి నిదురించుచున్న జయంతుని వధించెనట. అప్పుడు నాసోదరి కేకలు వేయగా మాతండ్రి జని యేలవధించితి వని కారణంబడుగ నిర్భయహృదయుండై నేనే మీ జయంతుని వధించితి. నన్ను మీయిష్టానుసారము జేయవచ్చునని ధైర్యముగా నుడివెనట. అంతనాతని మాతండ్రి కారాగారమున నుంపుడని యాజ్ఞాపించెనట. యేమి యీచిత్రము? దీనియందలి నిజానిజంబులు రేపుదయమున చెప్పెదననిగదా. తండ్రిగారివద్ద శలవు గైకొని వచ్చితిని. కాన యీ కారాగారమున నున్న సన్యాసినడిగి తెలిసికొనియెదగాక. (అని రెండడుగులుముందునకేగి) యిడుగో యిచ్చట కూర్చునియున్నవాడు. యేమేమో తనలో ననుకొనుచున్నాడు. ఈచాటున నుండి విని అనంతరము నడిగెదగాక.

(అని ప్రక్కకేగును)

ప్రవేశము—కారాగృహమున సన్యాసివేషముతో జయపాలుడు.

జయ—అక్కటా! కాలమెంతవైపరీత్యముగా మారినది. మిత్రుని తోఁగూడి రాజభోగము లనుభవించు నాకీ కారాగారమా నివాసస్థలము! ఇట్టి బ్రతుకు బ్రతికిన నేమి బ్రతుకకున్న నేమి. హా! దైవమెంతలో నెట్టిమార్పులు గలిగించెను. నాకర్మ ఫలం బిట్లుండ దైవమును దూరనేల. అనుభవింపక దప్పదు. ఈకష్టంబులన్నియు తృణప్రాయంబులు గాని జయంతుని వధయందలి యపవాదమాత్రము భరింపజాల.

వసం—(తనలో) ఈతని వాక్యములబట్టి జూడ సన్యాసివేషమును ధరించిన రాజకుమారుండనియు, అపవాద భరింపజాలనను టవల్ల యీతడీ ద్రోహము చేయలేదనియు స్పష్టమగుచు న్నది. గాన వీని నడిగి దీనియందలి నిజము గ్రహించెద. (అని ముందునకువచ్చి) ఓయీసన్యాసి వేషధరా! నీవీకారా గారమున నుండుటకు కారణమేమి?

జయ—(ఉలికిపడి ముందుజూచి) అయ్యా మీరెవ్వరు? నానంగతి మీకెందులకు?

వసం—నే నీ పట్టణమేలు రాజునకు కుమారుడ. నన్ను వసంతుడం దురు. మీరు నిన్నటిరేయి జయంతుని వధించితిరని తేబడిన నేరమును విని సందేహించి మిమ్ములనడిగిన నిజము తె ల్లమౌనని యిట్లు వచ్చితి.

జయ—రాజకుమారా! జయంతుని వధించిన మహాపాతకిని నేనే.

వసం—యేమట్లు చెప్పెదరు. మీరు సన్యాసివేషమును ధరించిన రాజపుత్రునివలె నున్నారే, గాన మీచరితము సవిస్తరము గా జెప్పి నన్ను ధన్యుం జేయుడు.

జయ—నే నెవండనయిన నేమి? రాజద్రోహము సల్పినతరువాత శిక్షించుటయే కదా రాజధర్మము.

వసం—అయ్యా, యిట్లనెదరేమి? నిజమెరుగవలయుగదా.

తే. గీ. సత్యము నసత్యమెరుగక • జగమునందు
ధీరులగు మిమ్ముబోంట్లకు • శూరులగుచు
శిక్షను విధించనేనియు • సిద్ధముగను
పరిభవపుఖండన బొందడే • పరమునందు.

కావున మీరెరిగి నంతవరకు నిజము వక్కాణింపుడు.

జయ—నేనీ ద్రోహముచేయునట్లు నీకు దోచుచున్నదాయేమి?

వసం—నిశ్చయముగా ద్రోహివి కానట్లే దోచుచున్నది.

జయ—అట్లయిన నీకార్యమెవరు చేసిరో యెరుగగోరెదవా?

వసం—అందునిమిత్తమే కదా నేనీ శ్రమపడుట.

జయ—అయ్యా రాజకుమారా! ఈద్రోహమందలి నిజానిజంబు లెరుగగోరెదవేని చాలాదుఃఖముల పాలుగాగలవు సుమీ. యోచించుకొనుము.

వసం—అయ్యా, నేనే యోచించుకొనుటెందులకు?

తే. గీ. ఎన్నికష్టములైన నిం • కెన్నిపాట్లు
బొందినను దీనిసత్యంబు • పూర్ణముగను
దెలుసుకొనగోరి యుంటిని • దెల్పుమయ్య.
మాయవేషధరుండవౌ • మాన్యచరిత.

ఎన్నిశ్రమలు బొందినను దీని నామూలాగ్రంబుగా దెలిసికొనుటయే నాముఖ్యాభిప్రాయము గాన నాయందు సంపూర్ణకృపాయత్తచిత్తుండవై దీనియందలి రహస్యము దెలుపుము.

జయ—ఓయీ యువరాజా!

తే. గీ. దీనియందలి నిజమును • దెల్లముగను
దెలియుటకు పట్టుదలనీకు • గలిగెనేని

నాదుయిష్టానుసారంబు • నడుతుననుచు
చేవ్రమాణము జేయుమా • వీరపుత్రి.

వసం—అయ్యా! ఇదిగో నాప్రమాణము వినుడు.

తే. గీ. దీనియందలి నిజమును • దెల్లముగను
దెలియుటకు పట్టుదలనాకు • గలిగెగాన
రేయియంతయు నీయిష్ట • రీతినడుతు
నిదిగో నీహస్తమున హస్త • మేయుచుంటి.

జయ—అట్లయిన నోయువరాజా! నావెంటరమ్ము జయంతవధాకారణరూపకము జూపెద.

వసం—సిద్ధముగా నున్నాడ.

(ఇరువురును ముందుకు నడచుచుండిరి)

వసం—అయ్యా!

తే. గీ. రాచబాటల నెల్ల నీ • ప్రక్కవిడచి
తుచ్ఛమేదరి గూడెము • త్రోవకెట్లు
దీసికొని బోవుచుంటివి • దెల్పుమయ్య
కారణం బదియేమొ కో • మారరూప.

జయ—రాజకుమారా! ఆవిచిత్రనాటక మిచ్చటనే ప్రదర్శింపబడును.

వసం—(తనలో) వరునిమాటల నాలించి నావంటి వాడిట్టి ప్రదేశశంబుల కొంటరిగా రానగునా? ఇచ్చటనే యావిచిత్రరూపకము జరుగుననియు చెప్పుచున్నాడు. భీతినొందనేల! నాకరంబున ఖడ్గమున్నంతవరకు యిట్టివానికి జంకుదునే!

జయ—రాజపుత్రా! మనమాగవలసిన ప్రదేశమిదియే. రమ్మీచెట్టుచాటున కేగుదము. (అని కొంచెము ప్రక్క కేగుదురు.)

ప్రవేశము—కన్నిగాడు

కన్ని—(పైకిజూచి) అప్పుడే జాము రాత్రియయినది. ఇంకను నాము ద్దుఁగుమ్మ రాలేదు. కారణమేమో తెలియదు. (ఆలోచన నభినయించి) నిన్నటిరేయి జరిపిన క్రూరకృత్యము బయలు పడలేదుగదా! నిజముగా వెల్లడి యయినయెడల నాజీవములు యమునన్నిధానమున కరుగవలసినదే. ఏమోగాని నా గుండెలలో దడపుట్టుచున్నది. యేమి కానున్నదో దెలియ దు. ఆచరించిన దనుభవింపక తీరునా?

వసం—అయ్యా! వీడెవ్వడు. ఇట్లు పలుకుచున్నవాడేమి. యేక్రూర కృత్యమాచరించెను? ఇట్లు చింతించు టెందులకు?

జయ—యువరాజా! ముందు ప్రదర్శింపబోవు విచిత్రరూపకము నకు వీడే కథానాయకుఁడు. యేక్రూరకృత్యమాచరించెనో యెందులకు చింతించుచుండెనో ఒక్క నిమిషములో తెలిసి కొనగలవు. ఆగుము.

వసం—(తనలో) నాకేమియు బోధయగుటలేదు. ఇదంతయు మి గుల నాశ్చర్యముగా నున్నది.

ప్రవేశము—దూరమున కమలవతి.

క—(తనలో) యేమినాబుద్ధి చాతుర్యము! ఎంతచక్కని పనిచేసితి ని. వాని కంతేకావలయును. నామీఁద నేరము లేకుండ తప్పు కుంటిని. ఇక నాకేమిభయము.

జయ—రాజకుమారా! ఆవచ్చుచున్న కాంతామణి యెవ్వరో యెరుగుదువా! యేమిమూల్గు[illegible]దవు?

వసం—(కమలవతిసజూచి) ఈమె నా చెలియలి[illegible]. అంతఃపుర సౌధములన్ని[illegible] పిశి యిూయర్ధ[illegible] క్రి సమ[illegible]

యిచ్చోటునకు రాగతమేమో తెలియకున్నయది. కను
గొని వచ్చెద. (అని ముందుకరుగబోవును.)

జయ—యువరాజా! ఆగుమాగుము. అప్పుడే యింతతొందరపడిన
యెడల దీని యుదంతము నీకెట్లు తెల్లమగును.

వసం—(ఆగి) ఈమె యెందుల కిచ్చటకు వచ్చినది?

జయ—నాటకము ప్రదర్శించుటకు వచ్చినది. ఈమెయే కథా
నాయిక.

వసం—(ఉలికిపడి) (తనలో) యేమీ నీచుడైన మేదరిని కథానా
యకుడనియు మాచెల్లెలగు కమలవతిని కథానాయికయనియు
చెప్పుచున్నాడు, యేమి కారణమో. (ఆలోచించి) తినబోవు
చు రుచినడుగనేల?

కన్ని—అదుగో నాముద్దుగుమ్మ. నావొయారిబొమ్మ. నావొరాల
మూట. నాచిలకల కొలికి వచ్చుచున్నది.

క—(మేదరివద్దకువచ్చి) మేదరినాయకా! ఇదిగో విజయురాలగు
కమలవతి నమస్కరించుచున్నది గైకొనుము.

వసం—ఓసీ! దుర్మార్గురాలా! ఇదేమి? మాకులంబున చెడబుట్టితివి.
ఈనీచుడైన మేదరియా నీకు నాయకుడు. వానికా నమ
స్కరింపుచుంటివి. ఛీ కులటా.

తే. గీ. పాపమున కించుకంతయు • భయమునొంద
కుండ, తుచ్ఛుడౌ మేదరి • గూడియున్న
కులటరో నిన్ను నాకర • వాలమునకు
బలియొనర్చియు కీర్తిని • బడయువాడ.

(అని ముందున కురుకబోవును)

జయ—రాజకుమారా! ఆగుమాగుము. తొందరపడబోకుము. ముం
దున్నది ముసుళ్ళపండుగ యనునట్లు జయంతుని వధయందలి
సత్యమంతయు ముందుననే యున్నది.

వసం—మిత్రమా! నీవాక్పాశములకు బద్ధుడనయితి. లేకున్నచో వారలనిద్దర నీసరికే యమసదనమున కంపియుందును.

కన్ని—చెలీ! కమలవతీ! నిన్నటిరేయి నీభర్తను వధించితివా?

క—ప్రియుడా! మనము తలచినకార్యము వేరొకరీతి జరుగునా?

కన్ని—యేమాచరించితివో సవిస్తరముగా నాకెరిగింపుము. విన గోరెద.

జయ—అయ్యో! యువరాజా! ఇప్పుడా కాంత చెప్పబోవు సంగతు ల నేమరక నాకర్ణింపుము.

వసం—అట్లే వినియెద.

క—చెప్పెద నాకర్ణింపుము. నీయొద్ద ఖడ్గము తీసికొని తిన్నగా యంతఃపురమున కేగి నిదురించుచున్న నాభర్త నొక్కయేటున కే నరికితి. అంతనెవ్వడో సన్యాసి "చంపవలదు, చంపవలదు" అనుచునే యున్నచోటి కరుదెంచె.

కన్ని—(ఆతురతతో) తరువాత తరువాత.

క—వానినిజూచి, యిప్పుడూరకున్న యెడల ముందుకార్యమునకు భంగము గలుగునని యోచించి మాతండ్రిని మాభటులను యెవ్వడో యొక్కడు రాత్రియందు మదీయాంతఃపురంబు జొచ్చి మత్ప్రాణపతిని జంపుచున్నాడని పిలచితిని.

జయ—యువరాజా! జాగ్రతగా వినుచుంటివా!

వసం—ఆ, జాగ్రతగానే వినుచుంటిని.

కన్ని—(భయముతో) తరువాత.

క—తరువాత నాతండ్రితెంచి ఆదురాత్ముని కారాగారమునకుం పుడని భటుల కాజ్ఞాపించె.

వసం—ఓసీ దుష్టురాలా! యెంత కుట్రపన్నితివి. నీవింతటి దుష్టురాలవయ్యెదవని కలలోనైన దలచలేదు.

సీ. జనని గర్భమునందు • ఛండాలివై బుట్టి
కులటవయ్యెదవను • కొనగలేదు
తల్లిదండ్రుల శోక • వెల్లువలోముంచి
కులటవయ్యెదవను • కొనగలేదు
పతిపొందు విడనాడి • పరుని పొందునుగోరి
కులటవయ్యెదవను • కొనగలేదు
పరునితో జేరియు • ప్రాణేశ్వరుని జంపి
కులటవయ్యెదవను • కొనగలేదు.

తే. గీ. నీచుడా మానవునిగూడి • నీతివిడచి
కులటవయ్యెదవని నేను • దలచలేదు
భవ్యనతక్షత్రినాయక • వంశమందు
కులటవయ్యెదవని నేను • దలచలేదు.

క. పుట్టిన గృహంబునకుమరి
మెట్టినయింటికిని కీర్తి • మెలగెదవను కొం
టట్టిటుగాకుండను చే
పట్టితివానీచకులుని • బల్మోహముతోన్.

ఓసీ దుష్టచిత్తా?

తే. గీ. నీచుడగువానితో గూడ • నిన్నునాదు
క్రూరఖడ్గము పాల్జేతు • క్రూరముగను
స్త్రీవధను జేయుపాపము • జేరనిమ్ము
జనులుదుర్మార్గుడీవని • యనగనిమ్ము

(అని యొరలోని కత్తిపెరకి ముందున కేగబోవును)

జయ—యువరాజా! యిట్లు తొందరబడి యేగుటతగునా? మదీయా నుమతప్రకారము వర్తింతునని బాసచేసితివిగదా.

వసం—అయ్యా మహాత్మా! నన్నెందుల కిట్లు బాధించెదరు. నేనిక నాకూ్రరవాక్యంబుల నాకర్ణింపజాల, గాన నాకనుజ్ఞదయచే యుము. ఈనీచులవధించెద.

జయ—ఓయీ, నీవిప్పట్టున వీరల వధించినచో జయంతునివధయం దలి నిజంబెవ్వరికిని దెలియదు.

వసం—అట్లన నిప్పుడు వీరలకారాగారంబున ద్రోయించి రేపుద యమున విచారణసేయుదము, గాన భటులను బిలచెద.

జయ—అట్లే కానిమ్ము.

వసం—రాజభటులారా యిటురండు. ఇటురండు. (అని పిలచును)

కన్ని—కాంతామణీ ఆచాయ నేదోకలకలము వినవచ్చుచున్నది. చూడుము.

క—(భయముతో) యేమయియుండును?

కన్ని—(వణకుచు) అదిగో ఆవృక్షమునీడ నెవరో యిరువురు పురుషు లు మనరహస్యము వినుచున్నారు జూడుము.

క—(నిదానించి) అయ్యో, యింకెట్లు బ్రతుకగలము!

కన్ని—'ఆ' అట్లనుచుంటివేమి? వారెవ్వరు?

క—ఇంకేమున్నది. మనరహస్యము బట్టబయలయినది. వారలలో నొకరు నాసోదరుండగు వసంతుడును రెండవవాడు నిన్నటి రేయి నన్నపవారింప వచ్చిన సన్యాసి. అయ్యో! యింకెట్లు జీవించగలము. పారిపోవుదమన్న మార్గమగపడుటలేదు. యే మిసేయుదు. నాపురాకృతకర్మ ఫలం బిట్లున్నది. అనుభవిం పక తప్పునా. (అని నేలగూలును)

కన్ని—అయ్యో నేనెరిగి యెరిగి కొంప ముంచుకుంటిని. మోహమే నన్నట్లు ప్రేరేపించినది. ఇక ప్రాణంబులు దక్కవు. మరణమే శరణ్యము. అయినను యిటు పారిపోయెద. (అని పక్కకేగి)

బాబో! యిరుగో! యీవంకకే భటులు పరుగెత్తుచు వచ్చు చున్నారు. (అని క్రిందపడును.)

ప్రవేశము—రాజభటులు.

1 భ—అన్నా! మనలనిప్పుడు బిల్చినవారెవరు?

2 భ—తమ్ముడా! యిది మనయువరాజుగారి కంఠధ్వనివలె నున్నది.

1 భ—మనల నింతయర్ధరాత్రి సమయమున బిలుచుటకు కారణ మేమో.

2 భ—అరుగో మనయువరాజుగారిచ్చోటనే యున్నారు. వారల కడకేగి కారణం బరయుదము రమ్ము.

(అని యిరువురును వసంతుని కడకేగి) యువరాజా! మమ్మీయర్ధరాత్రియందు బిలువగారణమేమి?

వసం—భటులారా! మీరీకాంతను, యీమేసరివానిని కారాగారమునకు గొనిపోయి యందుంచుడు.

1.2 భటులు—చిత్తము (అని కమలవతిని కన్నిగానిని తీసికొని, నిష్క్రమింతురు)

వసం—మిత్రమా చాలరాత్రియయినది. మనమేగి నిద్రింతము రమ్ము.

జయ—యువరాజా! నీవింటికేగి నిద్రించుము. నేకారాగృహంబునకు బోయెద. రేపుదయము సభాభవనమున మరల కలియుదుము.

(అని యిరువురును నిష్క్రమింతురు)

ద్వితీయరంగము—సభాభవనము.

ప్రవేశము—కళాశేఖరుడు, సుబుద్ధి, న్యాయవాది గోపాలరావు.

సు—తే. గీ. శ్రీమహారాజ గుణభోజ • శిష్టరక్ష
పూర్ణచంద్రునిబోలు మీ • ముఖము నేడు
కాంతిహీనముగా నుండె • కారణంబు
దెల్పదగునేని కోరితి • దెల్పుడయ్య.

కళాసే—మంత్రిసత్తమా! యేమని వక్కాణింతు.

సీ. అర్ధచంద్రు నిరీతి • నతిసుకుమారమౌ
ఫాలభాగము గల్గి • వరలువాని
కలువరేకులరీతి • కాంతియు నయనము
ల్గలిగిసుందరుణ్డౌచు • వెలయువాని
శత్రువర్గంబుల • సాహసంబున గొట్టు
బహువల్లికలతోడ • బరగువాని
శత్రురాజులనెల్ల • జడిసిపారగ జేయు
వెడదయురము గల్గి • వెలయువాని
తే. గీ. మన్మథునిరీతి భార్యతో • మందిరమున
గలసి నిద్రించి వేడ్కతో • జెలగువాని
నాదు జామాతు నొక్క స • న్యాసివాడు
యేమి జెప్పుదు వధియించె • నింపుమీర.

సుబు—రాజచంద్రమా యెంతపని జరిగినది. ఆసన్యాసి నేమిచేసిరి?

కళాసే—కారాగారమున నుంచితి.

గో—విచారణ జేయలేదా?

కళాసే—నిన్నటి దినమున విచారణజేయబోగా నాకుమారుండగు వసంతుడు "నాయనగారూ యీవధను గురించి నాకనుమానముగానున్నది గాన, నాకొక్కదినము సెలవు దయచేయుడు. దానియందలి న్యాయాన్యాయంబులు గనుగొని దెలిపెద"నని సెలవు గైకొని యేగెను. విచారించవలసిన దినమిదియే. ఇంకను నాకుమారుడు రాలేదు. కారణము దెలియదు.

ప్రవేశము—వసంతుడు

వ—తండ్రీ! తమకుమారుండగు వసంతుడు నమస్కరించుచున్నాడు గైకొనుడు. (అని నమస్కరించును.)

కళాసే—కళ్యాణమస్తు. కుమారా! నిన్నటిరోజున నీవేగినకార్య మేమయినది?

వసం—తండ్రీ! నే జయంతుని వధయందలి నిజమునుదెలిసికొంటిని. ద్రోహులను రప్పించెద. భటులారా! నిన్నటిరేయి కారాగారమున నుంపబడినకాంతను, పురుషుని, మొన్నటిరేయి యుంపబడిన సన్యాసిని యిచ్చటకు గొనితెండు. వేగబొండు.

భటులు—చిత్తము. (అని నిష్క్రమింతురు)

కళాసే—కుమారా!

తే. గీ. రేయికారాగృహంబున • ద్రోయబడిన
వారలెవ్వరుజెప్పుమా • వరకుమార

వ—తండ్రీ!

నేనువారలజెప్పగా • నేలనయ్య
మీరెజూతురుక్షణకాల • మేగసిండు.

ఇప్పుడే మీకెరిగించి సంతాపము గలిగించనేల. అరుగో ఆద్రోషులను భటులు వెంటబెట్టుకొని వచ్చుచున్నారు. ఇప్పుడే మనకంతయు దెల్లమగును.

ప్రవేశము—కమలవతి, కన్నిగాడు, సన్యాసి.

కళాసే—(తనలో) ఆహా! యేమిచిత్రము! ఆవచ్చువారిలో కమలవతికూడ నున్నట్లున్నయది. కారణమేమి! నామతి భ్రమించుచున్నదాయేమి? (ప్రకాశముగా) నందనా ఆమె మనకమలవతివలె నున్నది. అగునా? నే భ్రమించుచుంటినా!

వసం—తండ్రీ మీరు భ్రమించుచుండుటలేదు. ఆమెమన కుల కళంకమగు కమలవతియే.

కళాసే—తనయా! నాశరీరము కంపమెత్తుచున్నది. వీరలందరు ద్రోహులనుటవల్ల జయంతునివధ చాలచిత్రముగా కన్పట్టు చున్నది.

వసం—జనకా! కాలయాపనమేల? కారాగృహమున నుండుటకు కారణము వారలనడిగి తెలిసికొనుడు.

కళాసే— పుత్రీ! కమలవతీ! నిన్ను కారాగృహముననుంచినవా రెవరు? అందులకేమికారణము?

క—(కన్నీరునించుచు తనలో) అయ్యో! యెంతయాపద సంభవించెను! యీనిందునభాభవనమున నేజేసినపాపకృత్య మెట్లు చెప్పగలను. ఇంతకన్న పరాభవము వేరొండున్నదా. ఇంక నేనెట్లు జీవించియుండగలను? నాకుదిక్కెవ్వరు? (అని తల వాల్చి నిలుచును)

కళాసే—కుమారీ! నావాక్యములకు ప్రత్యుత్తరమీయవేమి? యెందు కట్లు చింతించెదవు? వేగదెల్పుము?

క—జనకా నే నేమనిచెప్పగలను. నేజేసిన క్రూరకార్యంబునకు దగిన ట్లనుభవించుచుంటిని. నాకృత్యమేనన్ను కారాగారమున బడవైచె. యింక నేజెప్పజాల. నాయుదంతంబంతయు నాసోదరుడే యెరుంగును.

సు—ఆహా! యేమి యిదంతయు వింతగానున్నది.

కళాసే—కుమారా! అగ్నిహోత్రముపై నాజ్యముచిలికించినట్లు నా సంతాప మంతకంత కధికమగుచున్నది. నే విచారణ చేయజాల.

వసం—పోనిండు. అయ్యా! గోపాలరావుగారూ, యీవధావర్తన సానము తమరు విచారించి దెల్పుడు.

గో—అట్లే విచారించెద. (అని మేదరిని విలోకించి) ఓరీ! నీవెవ డవురా?

క—(భయము నభినయించి) బాబూ! నేను మేదరినండి. నాపేరు కన్నిగాడందురు.

గో—నిన్నే కతమున కారాగారమున నుంచిరి?

కన్ని—అయ్యా! మాయింటికడ నేనుండ నన్యాయంబుగా గొందరు రాజభటులు నాపైబడి నన్నీడ్చుకొని వచ్చి కారాగారమున నుంచిరి. ఇంతకన్న వేరొండు కారణమేమియు నాకు దెలియదు.

వసం—ఓరీ దురాత్మా! దీనియందలిసత్యము మరుగుపరపక జెప్పవేని నిన్ను కండకండలుగ జీరించెద జాగ్రత.

కన్ని—(తనలో) హా! పాపపుదైవమా! నాకెట్టిగతి పట్టజేసితివి. నన్ను రక్షించువారెవరు? నన్నీపాపమోహాములో ముంచి నీచుడనగునాకు మహారాజపుత్రియగు కమలవతితో స్నేహముగలుగజేసి తుదకిట్టియవస్థ దెచ్చిపెట్టితివా? దైవమును దూరనేల? మోహామదముచే క్రొవ్వి కుడిచి కూర్చునియుండలేక కొరివితో స్వయముగా తలగోకుకుంటిని. నిజముచెప్పక దప్పునా?

వసం—ఏమిరానీచా? మూగవానిచందమున నూరకుండెదవు. నీయుదంతంబంతయు నిదివరకే నాకు దెల్లమయ్యె. నిజము చెప్పకపోయినచో కఠినదండన పాలగుదువునుమా.

క—అక్కటా వీడు నిజము తెల్లముచేయునుగాబోలు.

కన్ని—అయ్యా నిజముచెప్పెద నాలకింపుడు. నాకును. యీరాజపుత్రికిని చిన్నతనమాదిగా చెలిమిగలదు.

కళాసే—ఓసీ నీచురాల! యెంతనీచమాచరించితివి?

ఉ. రాచకులానబుట్టి జవ • రాంద్రులు గొల్వయియుండ నుండకన్
రాచకులంపునద్యశము • రంజిలజేయగలేక యక్కటా
నీచునిగూడి దుష్టగుణ • నేర్పరివై సుఖమందగోరి యీ
నీచపుకార్యముల్సలుప • నేర్చితివా కులటాశిరోమణీ.

గో—తరువాత నేమిజరిగినది?

కన్ని—ఇట్లుండ నొకనాడామె "యీరోజున నాప్రాణేశ్వరుం డే తెంచె"నని జెప్పెను. అప్పుడునేను "అట్లయిననీవు నీభర్తతో నేగుదువుగదా. నీకునునాకును స్నేహమెట్లు పొసగును. ఇది మొదలు నాకడకు రావలదు"అని నేజెప్ప నావలుకులు పెడ చెవింబెట్టి "నీవద్దనున్న ఖడ్గము నిమ్ము. నానాధుని వధించి వచ్చెద"నన మోహాము కన్నులగప్పుటచే మంచిదని ఖడ్గము నిచ్చితి. ఆమె ఖడ్గమును తీసికొనిబోయి మరునాడు మరల రాగా "యేమిచేసితి"వని యడిగితిని. అంతనామె "నాభర్త కంఠము నరికితిని. నరుకుచుండ వద్దువద్దనుచు నెవ్వడో సన్యాసి వచ్చెననియు అప్పుడేమియు దోచక యెవ్వడో దురాత్ముడు నాభర్తకంఠము నరుకుచున్నాడని యఱచితిననియు అంత మాతండ్రిగారును భటులునువచ్చి వానిని కారాగారమున నుంచిరనియు" నాతో జెప్పెను. ఇంతకన్న నేనెరిగినసంగ తేదియు లేదు. నన్నేమిచేసినను యనుభవించుటకు సిద్ధముగా నున్నవాడ.

కళానే—ఆహా స్త్రీలెంతఘాతుకులు. ఓసీ! కులటా! నీవేమోకీర్తి దెచ్చి మమ్ముద్ధరింతువని యెంచితినిగాని యిట్లుదలచలేదు.

తే. గీ. కులమునెంచక కడజాతి • క్రూరుడయిన
మేదరినిగూడి మిక్కిలి • సాధుడయిన
ప్రాణనాధుని వధియింప • పాడియగునె
స్వాంతమున నించుకంతయు • భయములేక.

వసం—జనకా! ఈవధయందలి నిజానిజంబులు దెల్లమయ్యెగదా గావున వీరలకు శిక్షవిధింపుడు.

కళాసే—తనయా! ఈనీచులకు నే శిక్షవిధింపజాల. మీయిష్టాను సారంబుగా మీరలే శిక్షవిధింపుడు.

వసం—మంత్రిసత్తమా! వీరలకెట్టిదండన విధింపవలయునో దెల్పుము.

సు—యువరాజా! దండనవిషయమై మనకవసరములేదు. ఈన్యాయవాది గోపాలరావుగారే యానతిచ్చెదరు.

గో—మీరందరాభారము నామీదనే మోపితిరిగాన యీమెపరుని బొందుటయే గాక పాణేశ్వరుని హత్యయొనర్చినది గావున మరణదండన విధించుటయు, యీమేదరివాడు రాజపుత్రి యనియెంచక స్నేహముచేసి హత్యలోసహాయమై ఖడ్గమిచ్చె గావున మరణదండనవిధియుంపక జీవితపర్యంతము ద్వీపాంతరవాసము విధించుటయు నాయభిమతము తరువాత మీయిష్టానుసారముగా ప్రవర్తింపుడు.

కళాసేను— ఈతీర్పు బాగుగానేయున్నది.

వసం—ఓసీకులటా! కమలవతీ నీవు పరునిపొందుగోరి పాణేశ్వరుని వధించితివి గావున నీకు మరణదండన విధియింపబడియె. (మేదరినివిలోకించి) ఓరీమేదరీ! నీవు పరకాంతాసక్తచిత్తుండవై యీహత్యలో ఖడ్గమునిచ్చి సహాయముచేసితివిగాన నీకు జీవితకాలము ద్వీపాంతరవాసము విధింపబడియె. భటులారా! యీమెను వధ్యసిలయొద్దకు తీసికొనిపోయి యురిదీయుడు.

(భటులు కమలవతితో నిష్క్రమింతురు)

కళాసే—(కమలవతి నుద్దేశించి) ఓసీకులటా!

తే. గీ. సుగుణగణఖని వౌచు నీ • జగతియందు
శోభిలుదువంచు దలచితి • సుస్థిరముగ

కాని యీరీతి నీచుని • గలసి యశము
దొలగఁజేతు వటంచునే • దలచలేదు.

అయ్యా తాపసోత్తమా! యీదుర్మార్గురాలి వాక్యము లాలించి మిమ్ముల కారాగారమున నుంపించితి క్షమింపుడు.

జయ—మహారాజా! క్షమించుటకే నెంతవాడ విధియే నన్నట్లు కారాగృహంబున కీడ్చుకొని జోయెను గాని మీవల్ల నేరమే మున్నది.

కళానే—భటులారా! ఈనీచుని జూడజాల కారాగారమునకు గొనిపొండు.

కన్ని—(తనలో) హాభార్యా పుత్రులారా నాదండన విని మీర లెంతచింతించెదరో. మిమ్ముల బోషించువారెవరు? చిన్న తనముననే మీకిట్టి కష్టంబులం గలుగజేసితిని. హా! భామా మణీ! నీవుజెప్పిన నీతివాక్యములన్నియు పెడచెవింబెట్టి రాజ ద్రోహంబు గావించితి గాన నాకు తగినప్రాయశ్చిత్తం బగు చున్నయది. నానుదుట వ్రాసిన వ్రాలు మెవరు తప్పింప గలరు. నాకై మీరు చింతింపవలదు. (కమలవతి నుద్దేశించి) హా రామామణీ కమలవతీ నేనెన్నిమారులు వలదని జెప్పినను వినక తుదకిట్టి కష్టంబుల పాలుగావించితివిగదా. నిన్ను దూరనేల నామోహామే నన్నింతవరకు దెచ్చినది.

(అంతభటులు వాని నీడ్చికొని పోవుదురు.)

కళానే—(లోనికేగి మరల పళ్ళెరముతో తిరిగివచ్చి) అయ్యా యతీ శ్వరా! నే నిచ్చుకానుకం గొని నన్ను ధన్యుంజేయుడు. (అని పళ్ళెరము ముందిడును) అయ్యా! ఇట్టికానుకలు మాకేల!

ఉ. శ్రీకరసూర్యవంశకుల • సేఖర రాజకులప్రదీపకా
యాకుల కందమూలముల • హారముగా విపినాంతరంబునన్

జేకొనియుండు మేమిలను • జెప్పగ శక్యముగాని కానుకల్
జేకొన నర్హమౌనె మను • జేంద్ర మనంబున చింతవీడుమా
కళానే—మీచిత్తము. అయ్యా! సెలవుతీసికొనెదము. మంత్రిసత్తమా బోవుదము రమ్ము. (అని ముగ్గురును నిష్క్రమింతురు)

వసం—మిత్రరత్నమా! మీయుదంతం బిప్పుడైన జెప్పెదరా!

జయ— రాకుమారా! నాయుదంతంబుతో నీకేమిపనియున్నది.

వసం—మీయట్టిమహానుభావుల చరిత్రలు విన్నపక్షమున సకల పాపములచే విడవబడ్డవాడనగుదు గాన జెప్పి సంతోష పరుపుడు.

జయ—అట్లయిన క్లుప్తముగా జెప్పెదనాలకింపుము. నేనును మీ భావుకుండగు జయంతుడును చిన్నతనమాదిగా మిత్రులము. అట్లుండ కొన్నిదినంబులకు నొకవారకాంతమూలమున విరోధులమైతిమి. అతడు నన్నువిడచి మీగృహంబున కేతెంచె. నేనాతని వీడలేక మీపట్టణంబుజేరి నిన్న మన మేగిన వృక్షముక్రింద గూర్చుని వారల రహస్యసంభాషణ మాలించి మిత్రునికాపాడగోరి యంతఃపురమున కేగితిని. తరువాయి చరిత్రమీకెరిగినదేగదా. మిత్రుడు బాసివచ్చె నని యోగినై అరణ్యాదుల వెంటనరుగ నిశ్చయించితి.

వసం—

ఉ. ధన్యుడనైతి మీసుచరి • తంబును వీనులవిందుగా విని
న్మాన్యుడనైతి మీకృపకు • మానివరేణ్యా ధరాస్థలిన్సురా
జన్యులలోన శాశ్వతయ • శంబును బొందితిగాదె చూడసా
మాన్యులకట్టిసంగతులు • మందునకైన వినంగవచ్చునే.

ఉ. ఇచ్చెదరాజ్యసంపదల • నిచ్చెద రత్నవిభూషణంబులన్
యిచ్చెద దంతిసంఘముల • నిచ్చెద స్వర్ణవికారవస్త్రముల్

యిచ్చెదవాజిసంతతుల • నిచ్చెదరథ్యభటాళినెల్ల నీ
కిచ్చగుదెద్దొగోరుమిక • నిచ్చెదసందియ మందబోకుమా.

జయ—రాజకుమారా! నీదాతృత్వమునకు చాలాసంతసించితి.

ఉ. కోరను రాజ్యసంపదల • గోరనురత్నవిభూషణంబులన్
గోరనుదంతిసంఘముల • గోరనువర్ణదుకూలరాజముల్
గోరను వాజిసంతతుల • గోరనురథ్యభటాళినెల్లనే
అయినను నీవుగోరమంటివిగాన
గోరితినీదుభావుకుని • కూరిమితో దయచేయుమాసఖా.

వనం—అయ్యా! నాభావుకుడు మృతినొందెగదా. నేనెట్లిత్తు.

జయ—మృతినొందెనని నేనెరుగనా! ఆమృతకళేబరమునే నాకిమ్ము.
యింకేదియు నాకవసరములేదు.

వనం—మీరెట్లుదీసికొనిపోవుదురు?

జయ—రాజకుమారా! అదియొకపెట్టెలోఁబెట్టి నాకిండు; నే తీసికొని
పోయెద.

వనం—(తెరలోనికిబోయి మరలవచ్చి) అయ్యా! ఇదిగో పెట్టె. నాకు
సెలవుదయచేయుడు నేనేగెద. (అనినిష్క్రమింతురు)

జయ—ఆహా నామిత్రునిగతి యింతాయెగదా. ఇంక నాయత్తవా
రింటికేగి నాభార్యనుగూడ పరీక్షించెదగాక.

(అని నిష్క్రమించును)

(తెరపడును)

తృతీయాంకము సంపూర్ణము





శ్రీరస్తు

శ్రీయాజ్ఞవల్క్యవరబ్రహ్మణేనమః

# జయంతజయపాలము



## చతుర్థాంకము

ప్రథమరంగము—ఉద్యానవనము.

ప్రవేశము—విచారముతో సుగుణమణి.

సు—హా! నవమోహనాంగా! మనోహరా! నీసుందరవదనారవిందము నాడెందంబును పూర్ణిమాచంద్రమండలముంబోలి అమందానందంబు నొందించుచున్నయది. ఇక నే నెట్లోర్తు? అగ్నిసాక్షిగ వివాహమాడిదీనురాలనగు నన్నొంటరిజేయ దలంచితివా? నీసాహసంబున కేమందును? యెందుజొత్తును? నీసుందర ముఖారవిందముగాంచకున్నచో నేజీవించగలనా. యిట్లెన్నినాళ్లు కన్నీళ్లు కార్చినను నాయరణ్యరోదనమాలించి నీజాడ మెరిగించుపుణ్యాత్ములెవ్వరు. నేనెంత మూర్ఖచిత్తను! యెంతమతిమాలినదానను! ఓ నాప్రాణేశ్వరా! నాకరంబు గ్రహించి యిప్పటికి నాలుగైదువత్సరములు గతించెను గదా. యింతకాలమునుండియు నిన్నే నమ్మకుని యొంటి ప్రాణముతోనున్న నన్నేల నీముఖకమలముజూపి సంతసింప జేయవు? నాకర్మ ఫలంబిట్లున్నదాయేమి? ఆహా! యీవిరహ తాపమెట్లోర్తును.

ఉ. ఏనెటులోర్తునీవిరహ • మేరికిజెప్పుదు నేరివేడుదున్
గానగ జూపువారెవరు • కాంచనసన్నిభగాత్రుసుందరున్

మానసహారుమత్ప్రతిని • మారకిరాతునిచేతిపక్షినై
ప్రాణములెన్నినాళ్లుబిగ • బట్టియునీభువినుండగల్గుదున్.
అక్కటా యిట్టి నా తను వెన్నాళ్లుగడుపవలయు.
సీ. మంచుబిందువులను • మంటలందునజిక్కి
జీవము లెన్నాళ్లు • గావవలయు
మారుబాణములను • నరుకులలోబడి
తాపమెన్నాళ్లని • దాచవలయు
చందనంబనిమెడి • జలరాశిలోబడి
కాలమెన్నాళ్లని • గడుపవలయు
అమృతజలంబను • యగ్నియందున గూలి
యునురులు యెన్నినా • ళ్ళుంపవలయు
తే. గీ. కోయిలలు గూయుచుండగ • గుండెరుల్లు
మనుచు శోకము నెన్నాళ్ళు • మనుపవలయు
వెన్నెలను జూచి మనసులో • వెరపునొంది
యూపిరిని యెన్నినాళులు • యుంపవలయు.

హా! హతవిధీ! నాప్రాణనాథుని నాకనాయానంబుగా లభింప జేయక యిట్టి దుఃఖములపాలుజేయ నీ కెన్నడైన నే యపకృతియైన నొనరించియుంటినా? నేదుఃఖంచుచుండ విని సంతసింపవలయునని నీకభిప్రాయంబు గలదాయేమి! అహా! దైవమా! నీచరిత్ర మెంత చిత్రము యెట్టివారలనైన కీలుబొమ్మల రీతి త్రిప్పుచుందువు.

సీ. విరహార్తిచే జాల • వేగితి నక్కటా
కాంతుని జూపరే • ఖగములార
కాలువలై కారె • కన్నీళ్ళు నాథుని
జూపి రక్షింపరే • శుకము లార
ఆహారమును వీడి • యలసితి వేగమే

నాధుని జూపరే • సాధులార
వలపు నాపగలేక • బహు కష్టపడుచుంటి
పతిని జూపింపరే • పత్రులార
తే. గీ. మన్మథుని బాణముల కోడి • మాడుచుంటి
విభుని జూపియు గావరే • పికములార
వెదకి వెదకియు బ్రాణంబు • విసిగియుంటి
వేగమే నాధు జూపరే • వేల్పులార

ఏమి నామిథ్యాభ్రాంతి ఎంత పిలచినను నాకాంతుని జూపు వారెవ్వరును లేరు. ఓనామనోహరా! నన్నిట్లు విడచియుండుటకు నిన్నెన్నడయిన యేమరియుంటి ననుకొంటివా.

తే. గీ. చిలుకలకు వేడ్కనలపాటు • చేయుచున్న
పద్యరాజము నీవిూది • వలుకెనుమ్మ
గానమును జేయబూనియు • వీణబట్టి
పాడు కృతులెల్ల నీవి నీ • తోడునుమ్మ

హా!మనోహరాంగా! నన్నీకష్టసముద్రమ్మున ముంచి యెచ్చట నుంటివి. నేనెంత దుఃఖించినను నన్నోదార్చువా రెవ్వరు (నలు వంకలపరికించి) అదిగో నాచెలి యగు నలీమణి వచ్చుచున్నయది యేమనునో యీ పూపొదచాటున డాగి వినియెదగాక (కొంచెము జాటున కేగును)

ప్రవేశము—నలీమణి

న—నాస్నేహితురాలగు సుగుణమణి యీదినమున నీయుద్యానవన మునకు రావలసినదని చెప్పియుండెను గదా. ఆమె యింత వరకునురాలేదు. కారణమేమో వచ్చువరకు నిచ్చటనే నిరీ క్షించియుండెదగాక (కూర్చుని) ఆహా! నాచరిత్రమెంత చి త్రము నవమన్మథునింబోలి సకల సుందరమూర్తి యయిన

నా కాంతుడు నన్ను విడుటచే గదా చిత్రమయ్యె. ఎన్నియు న్న నేమి నాథుడు లేని లోపము గొప్పదిగాదా మణిమయ వికారములైన శుద్ధాంతము లన్నియు అమావాస్యనాటి నిశినింబోలి గాఢాంధకారములై గన్పట్టుగదా! నేన త్తవారింటి కడుగిడినది మొదలు యొక్క నాడైన సంతోషపరచెనా? ఎల్లప్పుడును వారకాంతలతోడనే తనకాలము జరుపుచుం డెను. ఏమిసేయుదు దుర్మార్గు డన్నట్లును గాడు.

ఉ. క్రూరజడుండుగాడు మరి • కుంటియు గృడ్డియుగాడు మూర్ఖులన్
జేరియు పాపకార్యములు • జేసెడివాడును గాడు విద్యలో
సారగ్రహుండు సజ్జనుల • సమ్మతి మీరకయుండు మన్మనో
హారుడు నన్ను వీడె నక • టా గణికాంగన పొందు గోరుచున్.

సు—(తనలో) ఏమీ నాచెలిని భర్త విడచి వేశ్యాలోలుడై యుం డెనా? మాయిద్దరకు నొక్కరీతి కష్టంబులే సంప్రాప్తము లయినవి.

స—అయ్యో! నాథా యీ విరహమెట్లోర్తు? నన్నీ మారుడు బ్రతుక నిచ్చునా?

ఉ. మారుడు క్రూరుడై చుసుకు • మార శరీరము గల్గు నన్ను వే
నూరుశరంబు లేయుచును • నొప్పిని నెక్కుడు జేయుచుండె నో
శూరవరేణ్య తాళనిక • సొంపుగ గౌగిట జేర్చి వేగనా
మారుని బాణసంతతుల • మాద్భుము మంటను ద్రుగ్గజేయుమా

అక్కటా నే నెన్నను కొన్నను నామాటల నాలించి నన్ను రక్షించు పుణ్యాత్ము లెవ్వరు! యేమి కలికాలమహిమ! యీకాలం బున ననేకమంది ఉపన్యాస పీఠము లెక్కి ధర్మోపన్యాసము లిత్తురే వారందరేమయిరి. పైకి ఉపన్యాసము లిచ్చుచు లోలోన దుర్మార్గ వర్తులై చరియించుచుండిరి.

సీ. పరకాంతరతి గోర • నేర మానను వారె
వారకాంతల యిండ్ల • కరుగువారు
నాస్తి దైవంబని • నచ్చ జెప్పెడివారె
కాశీ ప్రయాగల • కరుగువారు
సత్యంబు దప్పక • చరియించు డనువారె
కూటసాక్ష్యములకు • దాటువారు
పరుల హింసించుట • పాతకంబను వారె
దారిదోపిళ్ళకు • దాటువారు
తే. గీ. "వలదు పరకాంతురతిగోర • వలదటంచు
కోడలికిజెప్పి యత్తరం • కోయినట్లు"
నీతివాక్కులుజెప్పుట • నేర్తురిగాని
చెప్పినట్టులచేతలు • చేయలేరు.

అబ్బా యీ ఆడుజన్మంబుకంటె నధమజన్మము వేరొండు లేదు. ఆడుజన్మము నెత్తిన యనేకకష్టములపాలగుదురు. ఆడుదై పుట్టుట కడునీచముగదా.

సీ. విపినాంతరంబున • వృక్షముగావచ్చు
కాంతయైపుడమిని • గలుగరాదు
పర్వతాగ్రమునందు • బండగావచ్చును
కాంతయై పుడమిని • గలుగరాదు
జగతిమృగాకృతి • జన్మమందగవచ్చు
వనితయైజగతిని • వరలరాదు
జలధినిమీనమై • వెలయగావచ్చును
వనితయైజగతిని • వరలరాదు
తే. గీ. కుంటియైనను పురుషుడు • గ్రుడ్డియయిన
నిడుములను జాలబడవచ్చు • పుడమియందు

గాని ధనధాన్యమెంతయు • గలిగియున్న
ఆడుదై పుట్టగారాదు • యవనియందు.

ఆవిచిత్రిచరిత్రాలోకరక్షకా! యేమిమా స్త్రీజాతియందు నీకింత యనాదరణ. పురుషులకే సర్వస్వతంత్రాధికారముల నిచ్చి, మమ్ముల ననాథలంజేసి ఆపురుషులనైన మాయందనురాగము లేకుండజేసి తివి. ఆహా ప్రాణేశ్వరుని బాసి బ్రతుకదగదుగదా.

సీ. పలుదుఃఖములుబొంది • బ్రతుకగావచ్చును
పతిబాసిక్షణమైన • బ్రతుకరాదు
జ్వలనముమ్రింగియు • జావగావచ్చును
పతిబాసిక్షణమైన • బ్రతుకరాదు
బడబాగ్నిలోబడి • భస్మముగావచ్చు
పతిబాసిక్షణమైన • బ్రతుకరాదు
ఆడబెబ్బులినోటి • బడవచ్చు నక్కటా
పతిబాసిత్రుటియైన • బ్రతుకరాదు
తే. గీ. కడుదరిద్రితచేతను • మాడవచ్చు
పతినిబాసియు త్రుటియైన • బ్రతుకరాదు.
దాసిజీవనమయినను • దాల్పవచ్చు
పతినిబాసియుత్రుటియైన • బ్రతుకరాదు.

అక్కటా యిట్లుజీవించుటకన్న ప్రాణంబులు బాసియుండుటయే మేలుగదా.

సు—(ప్రైకివచ్చి) చెలీ! సతీమణీ. యేలదుఃఖంచెదవు. ఊరడిల్లుము.
నాదుఃఖమువంటిదుఃఖమే నీకును వచ్చినది.

స—చెలీ నీవిచ్చోటునకే తెంచి యెంతసేపాయెను?

సు—ఇంతకుపూర్వమే వచ్చితిని.

స—(తనలో) ఈమెకునాచరిత్ర మెరుగవచ్చినదిగాబోలు.

సు—చెలీ! నీచరిత్రమంతయు యీపూపొదచాటున డాగి వినియుం టిని. ఎంతవారికైన విధివిధాన మలంఘ్యముగదా. పతివ్ర తాశిరోమణియగు ద్రౌపతీదేవి చరిత్రమెరుగవా. అట్టివారి కే అనుభవింపక దప్పలేదు. మనమనెంత.

తే. గీ. ద్రుపద భూధవునకు గూర్మి • దుహితయయ్యు
బలవరాక్రమయుతులైన • పాండవులకు
భార్యయయ్యును బలుపాట్లు • పడగలేదె
మనమనగనెంత చెలియరో • మాయజగతి.

స—చెలీ! సుగుణమసీవు నాకు చిన్ననాటి స్నేహితురాలవు గావున యింతదూరమా లోచించి పలికితిని. (తెరలో)

అమ్మా సతీమణీ! మీాయత్తగారేలొకో పిలుచుచున్నారు. వేగ రమ్మా.

స—(తొందరతో) చెలీ వింటివా ఆపలుకులు అప్పుడే పుట్టి ముని గిపోయినట్లు పిలుచుచున్నదట

సు—చెలీ! శీఘ్రముగా నరుగుము లేనిచో కోపగించునేమో. మరల కలుసుకుందము. ఇప్పటి కేగుము.

స—దయమాత్రముంచుము పోయివచ్చెద. (అనినిష్క్రమించును.)

సు—యొరులు దుఃఖింపకుండ నీతివాక్యము లెన్నో బలుకుదును గాని నాదుఃఖాగ్ని నెట్లు భరియింతు.

తే. గీ. నళినసంతతి రహితమా • కొలనుమాడ్కి
జగతినృపునులేనట్టి రా • జ్యంబు భాతి
రాజు, నక్షత్రములులేని • రాత్రిపగిది
వరలుపతి బాసియున్నట్టి • వనితబ్రతుకు.

హా హతవిధీ! నాకెన్నిపాట్లు గలుగజేసితివి. హాతల్లీ కాళికామహా దేవీ నీకింత బరువైతినా! సర్వకాలసర్వావస్థలయందును నిన్నేదైవ

ముగా నమ్మి నీనామస్మరణమే శరణ్యమని వేడుచుండ నాయందిట్టి నిర్దయవహించుట న్యాయమా. నాప్రాణేశ్వరుని నాకన్నుల కగపడునట్లు చేయలేవా? అక్కటా నాయందిసు మంతయు నీకు దయలేనప్పుడు నేనెన్ని మొట్టిలు బెట్టి వేడుకున్నను యేమి లాభము. నిన్నే గదా నాయిష్టదైవముగా భావించి పూజించుచుంటిని. నీవే యింత నిర్దయవహించినప్పుడు నేనెట్లు జీవించియుండగలను. తల్లీ! యికనా ప్రతిజ్ఞ నాలకింపుము. కొన్ని రోజులలో నాప్రాణేశ్వరుని నాకు దర్శనంబు గావించితి వేని మదీయ శిరంబు ఖండించి నీకు కానుకగా నిత్తు. యింతకన్న నాచేయు కార్యము వేరొండు లేదు అదిగో సాయం సమయమయినది. సూర్యభగవాను డపరాబ్ధికేగె. అడుగో మద్విరోధియగు జక్కులరేడరు దెంచుచున్నాడు యింటికరిగెద. (నిష్క్రమించును)

ద్వితీయరంగము—బయలు

ప్రవేశము—జయపాలుడు

జయ—ఆహా! మూడుదినములనుండియు యెంతనడిచినను అత్తవారూరు గానుపించుటలేదు. పాదములు పొక్కులెక్కినవి. కాళ్ళు పీకుచున్నవి. యీపెట్టె మోయలేక తలయంతయు నొప్పియెత్తుచున్నది. ఇంక నడువజాల. యిక్కడ కొంతకాలము విశ్రమించెద. (అని పెట్టెక్రిందకు దించి కూర్చుని) ఆహా! లోకమెంత పాపసంయుతము. కాంతలెంతకైనను జాలుదురు గదా. పైకెన్నియో శ్రీరంగనీతులు బలుకుచు లోపల ననేక క్రూరకృత్యములు జేయుచుందురు. కాంతల నమ్మరాదు గదా. కాంతలయొక్క మానసము గనుంగొన బ్రహ్మకైన దరంబుగాదు ఆహాలోకమాయ.

సీ. ఆడుబెబ్బులికోరలూ • డదీయగ వచ్చు
కాంతలహృదయంబు • గనగరాదు
శ్వేతవాయసమును • వెతకి పట్టగవచ్చు
కాంతలహృదయంబు • గనగరాదు
గిరిరాజములగిర • గిర ద్రిప్పగా వచ్చు
కాంతల హృదయంబు • గనగరాదు
మత్స్యపాదముజల • మందుజూడగవచ్చు
కాంతల హృదయంబు • గనగరాదు
తే. గీ. సూర్యచంద్రులగతి దప్ప • జూడవచ్చు
కానికాంతుల హృదయంబు • గనగరాదు.
సాగరము జొచ్చి కలుషము • సలుపవచ్చుఁ
గాని కాంతల హృదయంబు • గనగరాదు.

అందరును యిట్టి దుర్మార్గవతులేమై యుందురా లోకమున నెంతమంది పతివ్రితలు లేరు?

సీ. ముగురమూర్తులకును • దగమాత యయినట్టి
యనసూయ మహిమంబు • గాననగునె
రవిజునితో బోలి • ప్రాణేశ్వరుని జీవి
జేసిన సావిత్రి • జెప్పదరమె
పతితోడ వనముల • వెతలబొందినయట్టి
జానకి చరితంబు • వినగదరమె
నలునితో జేరియు • వలుపాట్లుబడినట్టి
దమయంతి చరితంబు• దలువవశమె
తే. గీ. శిష్ట గుణలోలుడైన వ • శిష్ఠుభార్య
యగుయరుంధతి మాహాత్మ్య • మరయదరమె

రాజ్యమును బాసిపతితోడ • రణ్యమునను
యున్న చంద్రమతి చరిత • మెన్నదరమె

ఏది యెట్లయినను నాభార్య గుణంబులు గూడ బరీక్షించెద
అదిగో అకన్పట్టుచున్న దాపట్టణమే గావచ్చును. వేగబోయెద.

(అని నిష్క్రమించును.)

(తెరపడును)

చతుర్థాంకము సంపూర్ణము.





శ్రీరస్తు

శ్రీయాజ్ఞవల్క్యవరబ్రహ్మణేనమః

# జయంతజయపాలము

## పంచమాంకము

### ప్రథమరంగము—అంతఃపురము

ప్రవేశము—జయపాలుఁడు, సుగుణమణి

సు—ఆహా! యేమి నాభాగ్యము

సీ. ఏసుందరాంగుకై • యీరీతి నిన్నాళ్ళు
మేని జీవంబులు • బూనినానొ
ఏమహామహునికై • యీరీతి నిన్నాళ్ళు
కామబాణంబుల • గ్రాఁగినానొ
యేమనోహరునికై • యీగతి కన్నీళ్ళు
గార్చుచును వెంగ • లార్చినానొ
యేరాజసుతునికై • యీదేహమర్పించి
విరహార్తిచే జాల • విసిగినానొ

తే. గీ. అట్టి సుకుమార సుందరుం • డమల గుణుడు
ముగుదప్రియుండు జయపాల • మోహనుండు
నాకు దర్శన భాగ్యంబు • నాదుభర్త
గలుగజేసెను నాభాగ్య • ఘనతగాదె.

జీవితేశ్వరా భార్యను పుట్టినయింటనే యిన్నినాళ్ళుంచ దగునా నాదా నీసుందరముఖారవిందము గాంచినతోడనే నాకష్టంబు లన్నియు గట్టెక్కనవనియే నమ్ముచుంటిని. నీదర్శన భాగ్యమెన్నటి కైన లభించునని వాసకై చాతకపక్షితపించు కైవడి యొంటి ప్రాణముతో జీవించియుంటిని.

ఉ. నాదుకరంబు జేకొనియు • నాలుగువత్సరముల్ గతించెనో
భూధవపుత్రభార్యనిటు • పుట్టిన యింటనే యుంచియిన్నినా
ళ్ళాధలు బెట్టగాదగునె • భావమునందున ప్రేమలేదె నీ
పాదములే గతెంచనెడి • భామనువీడుట భావ్యమే గదా.

కం. పతియే దైవమటంచును
కుతుకముతో నిన్ను బత్తి • గొల్చుచునుండన్
యతివను నన్నిన్నాళ్ళును
జతవీడగ జేయుతగునె • సారసనేత్రా.

ఉ. ఎవ్వనినేవరించితినో • యెవ్వనినేస్మరియింపుచుంటినో
యెవ్వనిబూజనేసితినో • యెవ్వనికై యిటు వేచియుంటినో
యెవ్వనిదైవమంచు మది • నెంచితో యానుకుమారుజూపెనే
డవ్విధికాళికాసతిని • నేర్పడజేతును స్తోత్రపాఠముల్.

గీ. ఇన్నిదినములుపుట్టింట • నన్నువిడచి
యుంటకునుకారణంబేమి • యొంటిగాను
మారసుకుమారమోహనా • కార వీర
వేగదెల్పుము వీనుల • విందుగాను.

జయ— కాంతామణీ చెప్పెదనాలకింపుము.

చ. మదనునిగేరురూపమును • మానిలయంబులగేరు కన్నులున్
మధుకతిమించుముంగురులు • మారునిమామను బోలుమోముయున్.
మదకరితుండముందెగడు • మంజులబాహులుగల్గినట్టి మా
మదనసమున్ జయంతునుకు • మారుని కాంతరోనీవెరుంగవా.

సు—నాథా నేనెరుగ కేమి. ఆనాడు మనవివాహంబున కేతెంచిన మారాకారుండగు రాజకుమారుండేగదా.

జయ—చెలీ అతడే. ఆతనికినినాకును చిన్నతనమాదిగా ప్రబలతరమగు స్నేహానుబంధము గలిగినది. ఒకరినెడబాసి యొకరమరనిమిషమయిన యుండలేకుండెడువారము. వేయేల శరీరములే రెండుగాని మానసముమాత్ర మొక్కటియే. అట్లు మాయిష్టానుసారముగా కేళీవిలాసంబుల బొద్దుపుచ్చుచుంటిమి. మిత్రత్వ మెంతటివారినైన మరువజేయునుగదా.

తే. గీ. తల్లిదండ్రులనయినను • తరుణినైన
భాగ్యభోగ్యములనుమరి • బందుగులను
కన్నసంతానమునుగూడ • కరుణలేక
మరువగాజేయుగాదయా • మైత్రిమహిమ.

చ. అతనినిగూడి మైత్రిమహి • మాంబుధి రేపవలొక్కరీతిగా
కుతుకముతో వినోదముల • గోరుచుసంతసమందుచుండియూ
జతలనువీడలే కకట! • సారసలోచన! మేముమాదు స
త్సతులను ప్రేమదక్కగడు • సన్నముజేసితి మేమిచెప్పుదున్.

కాంతా ఆతనితోగూడి సౌఖ్యాంబుధి దేలుచు కులకాంతల మరచి నిన్నునేక కష్టంబులపాలుగావించితిని.

సు—నాథా నాపురాకృత కర్మఫలంబున నింతకాలంబు వియోగము సంభవించినది. అంతియేగాని మీరేమిజేసిరి. ఇప్పటికి నాయందనుగ్రహము గలిగినది. అటుజూడుడు.

సీ. అదినుమీమీకోస • మాహారమునుమాని
చింతించుచుండెడి • యంతిపురము
అదినుమీమీమీది • పదములు వేడ్కతో
చిలుకలకలవాటు • చెప్పుచోటు

ఇదినుమీామిమ్ము నా • సదనముజేరగా
కాళికాదేవిని • దలచుచోటు
ఇదనుమీామీారొక్క • పాదముల్మదినిల్పి
సంతసించెదునట్టి • యంతిపురము
తే. గీ. ఇదినుమా వీణచేబట్టి • నీదుకృతులు
గానమును జేయగానేను • బూనుచోటు
ఇదినుమానిన్ను నామది • బాదుకొల్పి
చిత్రపటములు లిఖయింప • జేరుచోటు.

ఇప్పుడుమాత్రము మీామిత్రు నెల్లెడ బాసివచ్చితిరి!

జయ—(విచారముతో) కాంతామణీ యేమని చెప్పుదును.

తే. గీ. స్నేహవర్యులమయిమేము • జెలగుచుండ
దుఃఖమనుసాంద్రముననన్ను • దొలగద్రోసి
భూతలంబున రాజ్యంబు • బొందవిడచి
స్వర్గపురరాజ్యమేలంగ • జనియెనటకు.

అట్టి మిత్రరత్నము నాకెన్నిజన్మములకైన లభించునా? అట్టి మిత్రుడు గతించుటంబట్టియే నిన్ను జూచిపోవుదమని దలచి వచ్చితిని గావున నేనింత కాలమును నిన్ను విడచి నందులకు మన్నింపుము.

సు:—ప్రాణేశ్వరా! మీారంతమాట ఆడదగునా? ఎవ్వరికైన విధి విధానము లలంఘ్యములుగదా. దానికేమిగాని మీామిత్రుండగు జయంతు డేకారణమున మృతినొందెనో దెల్పుడు.

జయ:—ప్రేయసీ!

తే. గీ. కారణంబున కేమఃండు • నీరజాక్షి
యిలను జూడగ నిది కలి • కాలముగద

మునలివారలై వృద్ధులై • మూల్గుచుండు
పడుచువారలె స్వర్గంబు • వెడలుచుండు. 92

కాంతామణీ! "నుదుటన్ వ్రాసినవ్రాలు తప్పదిక నూరేం డ్లుచింతించినన్" యను నార్యోక్తి వినలేదా? ఎంతవారైన నేమి! పితామహుని వ్రాత తప్పించుకొనగలరా? అది యుంగాక యిక్కలికాలంబున వారకాంతాలోలురై అగ్ని సాక్షిగ వివాహంబాడిన భార్యారత్నంబుల పలుకష్టంబులు బొందించువారును, సంసారమంతయు మంటగలిపి జారుని పొందు గోరుచు ప్రాణేశ్వరుల వీకువారును, జంపువారును, నెక్కుడుగా ప్రబలి యుండిరి. దానికేమిగాని,

తే. గీ. మూడు దినములనుండియు • వీడకుండ
నడకచే పాదములు పొక్కి • లడెను గాన
కొంతకాలము శయనించి • కోమలాంగి
మార్గముననొందు యాయాస • ముడచుకొందు. 93

సు:—నాథా! అట్లే యొనర్పుడు. మీసౌఖ్యముకన్న నాకు వేరొండేమి గలదు. శయనించుడు. పాదములొత్తెద.

జయ:—(తనలో) ఈరోజున నీమె గుణం బెరుగవలయుగాన మును గుణ్తై చుకొని నిద్రించువానివలె నటించి యీమె ఏమేమి కార్యములు జేయునో గనుగొనియెదగాక. (అని మంచము పై శయనించును.)

సు:—(తనలో) నాథుడు నిద్రించుచున్నాడు. కొంతసేపు పాదములొత్తెద. (అట్లు చేయును.) (తెరపడును.)

ద్వితీయరంగము—కాళికాలయ సమీపము.

ప్రవేశము—సుగుణమణి.

సు:—(తనలో) ఆహా యిప్పుడు రాత్రి రెండుయామము లయినది. పుచ్చపువ్వువలె నెల్లయెడల వెన్నెల ప్రసరించుచుండెను,

పురవీధు లన్నియు జనశూన్యంబై యొప్పుచున్నవి. జనులందరు మాటుమణిగియుండిరి. శుకపికశారికాదులెల్ల నరవులు మాని నిశ్చింతతో నిద్రించుచుండె. వన్యమృగము లెల్ల సంచారములు మాని వరుండె. ఇదంతయు భగవన్మాయ గదా.

జయ:—(ప్రవేశించి) ఆహా నేననుకొన్నట్లే జరుగుచున్నయది. స్త్రీజాతి నెన్నడును నమ్మగూడదు. నేను నిద్రించితినని నమ్మి యీమె యెచ్చటికో యేగుచున్నది. యెచ్చటికేగునో యంతయు గనిపెట్టవలెగాక. (నడచుచు ముందు జూచి) ఇదిగో యీయర్ధరాత్రిసమయమున నిర్భయముగా నీతోవనే బోవుచున్నది. (ఆలోచించి) తినబోవుచు రుచినడుగనేల. దీని వెనువెంటనే యేగి దీని యుదంతంబంతయు తెలిసికొనియెద. (అని దాని కగపడకుండ నడచును.)

సు:—ప్రాణనాథుం డాయాసంబుచే బడలి నిద్రించుచుండె. ఈదినముననేగదా నానాథునకును నాకును కడసారి చూపులయ్యె ఇక నాప్రతిన నెరవేర్చుకొన నేగెద.

జయి:—(స్వ) ఆహా! యేమి! ఈమెవాక్యంబులం బట్టిచూడ నీమె దుర్మార్గమున కొడిగట్టలేదనియు, నాకాంతునకును నాకును కడసారి చూపు లిద్దివసంబుననే యనుటవల్ల యీమె యెందులకో ఆత్మహత్య చేసుకొనబోవుచున్నదనియు దెల్లమగుచున్నది. గాన నీమె నిప్పుడు వారింపుదునా? వద్దు. యీమె యెంతవరకేగునో, యెందుల కాత్మహత్య జేయుట కుపక్రమించుచున్నదో దెలిసికొని ప్రాణంబుల బాయుటకు సిద్ధముగా నున్నప్పుడు వారించెద.

సు:—అదిగో కాళికాలయము పోయినాప్రతిన నెరవేర్చుకొనియెద. (ముందున కేగును.)

జయ:—(తనలో) నేను గూడ నీమెవెంటనే యరిగెద. కాళికాలయము ప్రవేశించుచున్న దేమాచరించునో కనుగొనియెద. (అని వెంట నడచుచుండును.)

సు:—ఆహా! నాకై నానాథుడెంత చింతించునో, యెట్లయిన నేమి ప్రతినదప్పుట ధర్మవిరుద్ధముగదా. అదిగాక కాళికాదేవి కాగ్రహము గూడ గల్గును, గాన ప్రతిన తప్పక నేరవేర్చు కొనియెద.

జయ:—ఇప్పుడు స్పష్టముగా దెల్లమయినది. ఈమె మొదులలో యీదేవికి ప్రతిజ్ఞజేసినది అందులకై ఆత్మహత్య చేయబో వుచున్నది. ఇంకను నిదానించెదగాక.

సు:—(దేవి కెదురుగా నిలచి) హా! తల్లీ! లోకజననీ! కాళీశ్వరీ! నిన్ను బొగడ శేషునకైన- దరంబుగాదను నప్పుడు మా బోటి మానవుల లెక్కయేమి. అట్లయినను,

తే. గీ. నిన్ను వర్ణింపదలచుట • నిజముగాను
దేవతలకైన శక్యంబె • దేవదేవి
నేననగనెంత సఖులయ్యు • నేర్పుతోడ
వర్ణనలుజేసి గొంతునో • భక్తితోడ. 94

నీవాచరించిన కృత్యంబు లింతంతలని జెప్పదరమా

సీ. శిష్టజనులను వేడ్క • శిక్షించునట్టియా
దుష్ట రాక్షసమూక • దునిమినావు
పాపాంబుధిప్బడి • పాహిమాంపాహిమా
మని మొరలిడువారి • బూనినావు
ప్రజలభక్తులజేయు • ప్రతిపట్టణంబున
కాళికయను పేర • వెలసినావు

భక్తితో నీనామ • పఠనముల్జేసెడి
దాసుల ముక్తుల • జేసినావు

గీ. నాకవాసులచే మరి • నరులచేత
లోకమాతవటంచు జే • రొందినావు
కరుణచే నెల్లజీవుల • గాచుచుంటి
వహహా నిన్గొనియాడంగ • నగునె మాకు. 95

మరియు,

తే. గీ. విద్యగోరెడివారికి • విద్యనిచ్చి
విత్తమునుగోరువారికి • విత్తమిచ్చి
ముక్తిగోరెడివారి • ముక్తినిచ్చి
గాచుచుండవె యో మహా • కాళినీవు. 96

యేమి పలుకవు. నేనెందునిమిత్తము వచ్చితిననియా నీయభిప్రాయము. మున్న నేనుడివిన ప్రతిన వినలేదా యేమి! విననిచో చెప్పెద. నాలకింపుము.

జయ:— ఈమె మున్న నేదో ప్రతినబట్టినదట. ఇప్పుడు చెప్పునట గాన ఆప్రతిన నేనుకూడ నేమరక వినియెదగాక.

సు:— ఉ. నాథుని మూడురోజులకు • నాకడకంపితివేని వేడ్కతో
నాథుని కన్నులారగని • నామదియందున సంతసించి వే
నాదుశిరంబు రేయికడ • నాథుకఠోర కఠారధారలన్
ఛేదముజేసి కానుకగ • బెట్టెద ప్రీతితొ కాళికేశ్వరి!

జయ:— ఆహా యేమి యీప్రతిన. భక్తురాలన్న నీమెయే భక్తురాలు. సరే. యిప్పుడేమి జరుగునో చూచెద.

సు:— తల్లీ! నాప్రాణేశ్వరుని జూపి నాకు సంతసము గలుగజేసితివి గాన,

ఉ. నాథుని నీదినంబునకు • నాకడకంపితివౌ గదమ్మ నే
నాథుని జూచి సంతసము • నందితిగావున యింకనేను వే

నాదు శిరంబుజెండి గడు • నమ్మికనిచ్చెద గొమ్ము వేగమే
సాగుజనావళీవినుత • సాహసలక్ష్మిరొ. కాళికేశ్వరీ !
ఇదే నాప్రతిజ్ఞప్రకారము నాశిరస్సు నీకు గానుకగా నిచ్చు
చుంటిని. జేకొనుము.

(అని ఖడ్గము పెరికి కంఠము నరుకుకొనబోవును.)

జయ:—ఇక కాలయాపన జేసినచో గడు మోసము సంభవించు. గాన
వేగనేగి యుపవారించెద. (అని ముందున కరుగబోవును.)

(నేపథ్యమున)

ఓహో! పతివ్రతాశిరోమణీ! సుగుణమణీ! ఆగుమాగుము
ఆత్మహత్య కుపక్రమించుట మహాపాతకము గాదా. నీయట్టి
పతివ్రతాతిలకంబుల నీరేడు జగంబులలోనను నేజూడలేదు.
నీదుభక్తికిసంతసించితిని. నీపాతివ్రత్య మహిమకేనుమెచ్చితి.
నీకువలయు వరంబుల గోరుకొనుము. వేగనిచ్చెద.

జయ:—ఆహా యేమి యీమె మహాత్మ్యము. కాళికాదేవి ప్రత్య
క్షమై వరములగోరుమనుచున్నది. ఈమెకంటె ధన్యులు
గలరా. యేమి వరంబుల గోరునో యాలకించెద.

సు:—తల్లీ! కాళికాదేవీ! నాకు కావలసిన వరములన్నియు నిదివ
రకే సమకూరె. ఇంకేమి గోరుదు.

గీ. మాతరో కాళి నీయొక్క • మహిమచేత
ప్రాణనాథు డీవేళనే • వచ్చినన్ను
ధన్యగాజేసె భువిలోన • మాన్యనయితి
వరములింకేవి వేడ్కతో • గోరుదాన. 99

జయ:—కాళికాదేవి వరముల గోరుమనిన నాప్రాణేశ్వరుం జేర్చెం
చుటయే నాకు వరమనియు, నింతకన్న నెక్కుడు వరంబేది
యనియు యనుచున్నది. ఆహా యేమి దీని పతిభక్తి.

[మరల నేపథ్యమున]

భక్తురాలా! నీపతిభక్తికి సంతసించితి. నీవు వరముల గోరక పోయినను నేనిచ్చుచుంటిని. ఇది మొదలు నీకుశిహస్త మేశవముపై నుంచిన వారు మరల జీవించుచుందురు. అదియునుంగాక నీవు నీభర్తతో చిరకాలము సర్వైశ్వర్యముల ననుభవించి లోకంబున పతివ్రతాశిరోమణి యను పేరు వడసి పుత్రపౌత్రులం గాంచి అనంతరము నాసన్నిధిం జెందుదువుగాక.

సు:—ఆహా! ఇప్పుడుకదా నేధన్యనయితిని. నాభర్త నాకై యెంత చింతించుచుండెనో గాన గృహంబునకు వేగనేగెద.

జయ:—అక్కటా! కాంతలందరును దుర్మార్గవర్తనులనియే దలపోసితినిగాని యిట్టి కాంతలుకూడ యీకాలంబున నుందురని యెరుంగనయితి. నిష్కారణముగ నీమెయందపోహామునొందితి. (ముందుజూచి) ఈమె యింటికేగుచున్నయది. నేనీమెకన్నముందు నీమెకెరుకలేకుండ నేగి నిద్రించెద.

(అని నిష్క్రమించును.)

సు:—(ఆకసమువంక జూచి) అప్పుడే మూడవ యామము దాటుచున్నయది గాన వేగ నింటికేగి యిచ్చట జరిగిన యావద్వృత్తాంతమును నాభర్త కెరిగించెదగాక. (యని నిష్క్రమించును. (తెరపడును)

తృతీయరంగము—పడకటింటియందు

జయపాలుడు నిద్రించుచుండును.

ప్రవేశము—సుగుణమణి.

సు:—అహా! నాధుడింకను నిద్రించుచునే యుండెను. నిద్రించువారి మేలుకొలుపుట భావ్యముగాదు గదా. రేపుదయము

న జెప్పెద. (ఆలోచించి) ప్రాణనాథుండేదో పెట్టెనుగొని వచ్చెనుగదా. యేమి తెచ్చెనో. ఏమితెచ్చును? నాకొరకేవో వస్త్రాభరణంబుల గొని తెచ్చియుండును. ఆపెట్టె యెచ్చటనున్నదో వెదకి చూచెదగాక. (అని వెతకుటనభినయించి) యిదిగో యీమంచము క్రిందనే యున్నది. దీనిలో నేమున్నదో జూతునా? నాథునియాజ్ఞలేనిది చూచుట దప్పుగాదా. ఆ యేమితప్పు. నాకొరకేగదా ఏదో తెచ్చెను? పెట్టె తెరచి చూచెద. (అని పెట్టె తెరచి కుడిహస్తములోనికి బోనిచ్చి వెదకుచు) ఆ యేమి యింత మెత్తగాను మృదువుగాను దగులుచున్నది. యిది యేమి. (నిదానించి) అయ్యో యిదియొక మనుష్యశవము అని అట్లే యుంచి పైకివచ్చి ఆ యేమి యీమనుష్య శరీరము పెట్టెయందుంచి తెచ్చుటకు కారణము. నగలో నానెములో నాకొరకు గొని తెచ్చెనని దలంచితి. కాని యిట్లు దలచలేదు. యీ శవము దెచ్చుటకు కారణము రేపడిగెదగాక. నేనుగూడ నానాథునివజ్జ నిద్రించెద. (అని అట్లుచేయును.)

(మంచము క్రిందనుండి జయంతుడు లేచి) యేమీ యీదురాత్ముడు నేను నిద్రించుచుండ నన్ను క్రిందకుద్రోసి నా భార్యవజ్జజేరి నిద్రించుచున్నాడు. యేమీ వీని కండకావరము. మిత్రత్వమువీడి నేనచ్చినను నన్ను భూతమువలె వెంటాడించుచున్నాడు. ఓరీ దురాత్మా! పరకాంతను బొందగోరిన నాకెన్నో నీతులు గరపినావుగదా. ఆనీతులన్నియు నేమాయె. "ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ" అను నార్యోక్తికి నీవే తార్కాణమవు. ఆ యెంతకార్యమాచరించ సాహసించితివి. ఇదిగో యిప్పుడే నీప్రాణ

మూడదీసెద జూతుము. (అని కత్తి నెత్తుచుండ సుగుణమణి లేచి జూచి)

సు—ఓరీదుర్మార్గా! యెంతకూ్రకృత్యము జేయబూనితివి. ఆగు మాగుము. భార్యాభర్తల మిరువురము శయనించుచుండ నీ యంతిపురంబున కెట్లేతెంచితివి.

జయ—(తనలో) ఆహా! యీమెయెవ్వతె. నాప్రాణేశ్వరివలె గానుపించుటలేదే (అటునిటుచూచి) ఇది నేనిద్రించిన వడకటిల్లును గాదే. యేమి యిదంతయు మాయగానున్నదే. నేనిటకెట్లేతెంచితిని. యేమియు తెలియుటలేదు. నిష్కారణముగ నా భార్యపజ్జజేరి శయనించినాడని జయపాలుని వధింపనుకించితినే యీమె మాజయపాలుని భార్యయేగాబోలును.

సు—యేరాదుర్మతీ పలుకవు. మూగివానివలె నూరకుండెద వేమి. నీవెవండవు! యెందునిమిత్తమే తెంచితివి! నాభర్తపైకరవాలమెత్తుటకు నీ కేమపకారము గావించెను దెల్పుము.

జయ—అక్కా! నన్ను రక్షింపుము నేనును నీభర్తయగు జయపాలుడును చిన్ననాటనుండియు మిత్రులము. మాకిరువురకును కొంచెకారణంబున విరోధముగల్గి నే నాతనిబాసి మాయత్తవారింటికేగి యట నిద్రించితిని. యిటమేల్కాంచితిని. నాభార్యవద్దనే శయనించియుండెనని ముందువెనుక లాలోచింపక వరుకనుద్యమించితి. నేనిట కెట్లేతెంచితినో నాకు దెలియదు.

సు—(తనలో) ఇందాకటి పెట్టెలో శవమే యీతడై యుండును. నాకు కాళికాదేవిచ్చినవరప్రభావముచేతనే యీతడు జీవించుటధృవము. (ప్రకాశముగా) అయ్యా రాజకుమారా!

నీకేమియు భయములేదుండుము. నీమిత్రుడును నానాథు డును లేచుచుండెను.

జయ—(మేల్కాంచి కన్నులు నలుపుకొనుచుముందుజూచి తనలో) నేకలగనుచుంటినాలేక మేలుకొనియేయుంటినా? యీతడుమా జయంతుఁడగునాగాదా? ఆకాకేమి. మాజయంతుఁడే. నాకం డ్లుతెరచియే యున్నవి. యిదికలగాదు. అట్లయిన మృతిబొం దిన జయంతుఁడెట్లు జీవించెను. లేక భూతమయివచ్చెనా?

జయం—మిత్రమా! జయపాలా! నాతప్పుమన్నింపుము. (అని కా ళ్ళపయింబడును.)

జయ—(తనలో) యెంతయోచించినను యీతడు మరల జీవించు టకు కారణమేమో తెలియకున్నయది. నాభార్యనడిగి దెలిసికొనియెదగాక. ఆ జ్ఞాపకమువచ్చినది. రాత్రి నా భార్యకు కాళికవరమిచ్చెగదా. నేనేమో తెచ్చితినని పెట్టె తెరచెనుగాబోలు. ఆవరప్రభావముననే యతడు మరల జీవించె. (ప్రకాశముగా) మిత్రమా లెమ్ము.

(అని లేవదీయును.)

జయ—మిత్రమా! నేనిటకెట్లు వచ్చితిని. నాయత్తవారింట నిద్రిం చుచుంటినిగదా. నాకేమియు తెలియుటలేదు. కారణ మేమోజెప్పి నన్నానందింపజేయుము.

జయ—మిత్రమా! నీవు నీయత్తవారింటికడ వధింపబడితివి. నా భార్య పతివ్రతాప్రభావంబున మరల యిచ్చట జీవించితివి. యింతకన్న వేరొండేమియులేదు.

జయం—అహా! ఈమె మూలముననే జీవించితినా?

న—(తనలో) నారహస్యమంతయు నానాథున కెరుకపడెనా యేమి. యెల్లెరుకపడెను. నే కాళికాలయమున కరిగినతరువాత నా

వెనువెంట నేతెంచి నాయుదంతం బారసెగాబోలు. (ప్రకాశముగా) నాధా నన్నురక్షింపుము.

జయ—నిన్నేల రక్షింపవలయు నీవేమితప్పుకార్య మాచరించితివి దెల్పుము.

సు—మీకెరుకలేకుండా అర్ధరాత్రింబున కాళికాలయంబున కేగితి.

జయ—కాంతామణీ నీవెనువెంటనే నేనుగూడ యేదో దుర్మార్గకృత్యంబు జేయుటకొర కేగుచుంటివని దురభిప్రాయంబు నొందివచ్చి నీవు ప్రతిన నెరవేర్చుకొనబోవుటయు కాళిక వరమిచ్చుటయుగూడ వింటిని నీవంటి పతివ్రతాతిలకము లీ భూతలంబునగలరా. ఓపతివ్రతాశిరోమణీ, సుగుణమణీ.

తే. గీ. నీపతివ్రతామహిమచే • నేనుమఁగుడ
ప్రాణమిత్రుఁ జూడంగ • బడసినాడ
కాంతరో నిన్నుబోలెడి • కమలవతులు
భూతలంబున నొకరైన • బుట్టబోరు. 100

జ—ఓపతివ్రతాశిరోమణీ మృతినొందిన నన్ను మఁగుడ పునర్జీవితునింజేసి నామిత్రునితోఁగలిపి నన్నానందింపజేసితివి. నీరుణము నెన్నిజన్మంబులకైన దీర్చుకోఁగలనా. ఇదే వందనము లర్పించుచుంటిని గ్రహింపుము. (అని నమస్కరించును)

సు—అయ్యా రాజకుమారా నేనేమిజేసితిని. దైవఘటనయే యిట్లున్నది. యెప్పటికెట్లగునో యెవరుదప్పింపగలరు.

జ—మిత్రమా! నేనేకారణమున మామత్తవారింట మృతినొందితినో సవిస్తరముగా దెల్పుము

జయ—ఆ చిత్రకధయంతయు యిప్పుడు జెప్పుటకు రాత్రిచాలదు. గాన రేపుదయమున దెల్పెదలెమ్ము.

తే. గీ. కాళికాదేవివరముచే • కరుణచేత.
భూవరా జయంతమనము • భూతలమున
వెనుకరీతిని సఖులమై • వినుతికెక్కి
నారమింకేమివలయునో • గోరుకొమ్ము. 101

జ—మిత్రమా యింతకన్న నాకు వలయునదెద్ది అయినను నీవుగోర మంటివిగావున.

భరతవాక్యము

మంగళమహాశ్రీవృత్తము

రాజవరులాదరున • రాచకముగాక మహి
రాజ్యమును నేలుదురుగాతన్
భోజనములై పురుష • పుంగవులు సత్కవుల
పోషణము జేయుదురుగాతన్
స్త్రీజనములందఱు ప • తివ్రతలుమైయశము
జెందుదురు యీమెనరెగాకన్
పూజలనుజేసి కను • మోదమున సౌఖ్యములు
బొందుదురు మంగళమహాశ్రీ.

పంచమాంకము

సర్వము సంపూర్ణము



## శార్దూలవృత్తము.

శ్రీరమ్యుండు, విశుద్ధమూర్తియగు గౌరీనాథ పాదాబ్జముం
దారంబుల్ హృదయంబు నన్నిలిపి మోదంబొప్ప పూజించు, భ
క్తారాధ్యుండు, స్వతంత్రజీవనుడు సద్వ్యాపారధుర్యుండు, సాం
పారన్ రాజమహేంద్రపట్టణమునన్ వాస్తవ్యుడై యొప్పు శ్రీ
మారమ్యుంబగు కాళహస్తికుల తమ్మారావు సద్భక్తితో
మీరల్ వ్రాసినపత్రముచ్చునకు నామేల్గోరియుండంచు, వ
ల్మారుంగోరగ నీజయంతజయపాలం బొంతయున్ నేడ్కశ్రం
గారవప్రక్రియ వ్రాసియిచ్చితిని లోకంబందు వర్ధిల్లుతన్.

ఇట్లు

H. V. Jagannadha Sarma.

జయంతజయపాలమున కనుబంధముగా ప్రకటించు

కీర్తనలు మట్లువర్గరా.

1 మంత్రియగు జయవర్మ

కానడ—ఏకతాళము.

1 ధరవర తెలుపుము మీరీ
కరణిని గుందగ కారణమేమో॥ ॥ధర॥

2 మును మీ ముఖమెపుడున్ - గన నీగతి
ఘనతాపముగను బెడుగను - జననుతచరితా ॥ధర॥

3 పాలితులను గనపుత్రి - భావమున సతతము
పాలన సేతువుగా - బహుప్రేమన్ ॥ధర॥

4 పరభూపతులట - ధరబడి క్రొమ్ముక్కగ
నిరతము చేతువుగా - వరసగుణా భరణా ॥ధర॥

2 రాజు. గుణపాలుడు—కీర్తన.

మంత్రి సత్తమా - మాటవినుమా.
ఇంతవరకు నాకు - యింతలోటు లేదు
సంతసంబ డెంతో - సాగుచుండెగాని ॥మా॥
నీ కుమారునకునూ - నాకుమారునకును
పెండ్లి చేసి యెంతో - పెద్దకాల మాయె ॥మం॥
ఒకరిబాసి యొకరు - యొక్కక్షణమయిన
నకియ నెంచ రెట్లు - జతనువీడదీయ ॥మం॥

3 వ కీర్తన.

చంద్రముఖి.

1 యీపనికి నాకింతగ - నేల చెప్పవలయు దేవా.
రాజా - గుణభోజా - ఘన తేజా - సుగుణాలవాల ॥యీపని॥
2 సతతము స్నేహముతోడను - జతవిడువక యుండెడి యీ
సుతులనునే - జతవీడగ - కుతుకముతో జేసెదగా ॥యీప॥
3 మాయలెన్నో బన్ని నేను - జేయుచుంటి నెన్నోపనులు
యిది ఘనమా - ముదమున నే - వదలక యొనరింతున్॥యీప॥

4 వ పాట.

1 చూడుమా వసంతమహిమ - సుందరీమణీ చెలీ
చూడుమా - చూడుమా - చూడుమావసంత
2 మల్లెలు మొల్లలు - మాలతి దీవలు
అల్లుకొనియె నిట - కల్లగాదో చెలి ॥చూడుమా॥
3 రకరక మాసుమ - నికరము లెన్నిరయు
ప్రకటితమగు చుండె - నకియ బాగడ తరమా ॥చూడుమా॥

5 వ పాట.

జయంతుడు.

ఛీ, ఛీ, ఛీ, మిత్రద్రోహి - అరె ఛీ, ఛీ, ఛీ, మిత్ర .
చిన్ననాటనుండి నీతో - చేసిన స్నేహమునకుగా
ఎన్నడెరుగనట్టి కల్లమాటలు విన్నపంబుజేసితి వౌరౌర.
॥ఛీ, ఛీ, ఛీ,॥
యింతయు రహస్యమునా - వంతయులేదని బలికెదు
ఎంతజంత కారివాడ - వెవ్వడైన నినునమ్మునె॥ ఛీ, ఛీ, ఛీ,॥
వారవనిత నినుబిలచి - యేరహస్యమైన జెప్పక
కోరికతో నర్థరహితములు - కూయునె యెటుబొంకెదవౌర.
॥ఛీ, ఛీ, ఛీ,॥

6 వ పాట

జయపాలుడు.

మిత్రమా నామనవి వినుమా - ప్రాణమిత్రమా.
ఎన్నడైన నీకడనే - నన్నాకల్లనాడితినే
ఉన్నది నిజమే జెప్పితి - నెన్ననన్ను ద్రోయనాన ॥మి॥
వారకాంత మనలవేరు - బరచుటకై జేసెనయ్యో
నేరము లేదయ్యె యింత - నేబ్రమాణకంబుజేతు ॥మిత్రమా॥

7 వ పాట.

హిందూస్థాని-కాఫీరాగము-రూపకతాళము.

జయంతుడు.

రా మరోనను మోసగించితె - తామరసనేత్రి
కాముకుని నన్బాయనగునా - నీమదినిధాత్రి

తల్లిదండ్రుల వీడివచ్చితి - నెల్లి నీకొరకానుగా
వెళ్ళిపోవుట న్యాయమగునే - వీడియొంటరిగా
నిక్కముగనే నొక్కనిముసము - నిల్చియుండు టెటుల్
చక్కజేర్పుము మోహమార్పుము - సౌఖ్యమిమ్మయిటుల్॥
(అని చెట్టును కౌగలించును)

8 వ పాట.

కన్నిగాడు.

1 అన్నాల మిన్నా - నిన్నా రేత్రి నా
కెన్నో దెస్తి ... యా
తెన్నాన యీయా - లన్నంబు దిసకే
కన్నా దెరనుకుంటి ॥ఓ అన్నాల॥
2 పెండాల కాడనె - సందూ నేసుకు రాక
యెందాల కుంటేవు చానా నీ
కేందయిన నాటంక - మేమయిన గిలిగినా
విందు జెప్పుబల్ జా॥ ॥ఓ అన్నా॥

9 వ పాట.

వసంతుడు.

ఛీ ఛీ ఛీ కులపాంసని - ఛీ ఛీ కులఘాతినీ॥
ఛీ, ఛీ, ఛీ, ఛీ, ఛీ, ఛీ, ॥ఛీ ఛీ ఛీ కుల॥
నలుగురిలో కులమునెల్ల - నాతియుద్ధరింతువనుచు।
దలచియుంటి మానసమున - దలుపగలేదీరీతిని ॥ఛీ ఛీ ఛీ॥
కులటవై పతినిజంపి - చులకనయా మేదరిగని
కులమునిట్లు గంగగలిపి - చెలగెదవని - దలువనైతి ॥ ఛీ ఛీ ఛీ॥

## 10 వ పాట.

### సభలో కన్నిగాడు.

1 దండాలు బాబోయి - దండాలు మీాకు।
వందుకొనుండంగ - వట్టిరిబాబూ॥ ॥దండాలు॥
2 ఏపావ మెరుగను - యేవని యెరుగనూ।
కోపముతో బటులు - యీాపనిచేసిరిగాని॥ ॥దండా॥
3 బుట్టలల్లి నేను - పట్టుకెల్లియ్య లేదని।
కొట్టుకొంచు తిట్టుకొంచు - పట్టుకున్నారు బాబు॥
4 కల్లు తాగినేను - యిల్లు బయులుండంగ।
చెల్లు, చెల్లునగొట్టి - కాళ్ళుగట్టేశారు॥ ॥దండా॥
5 పిల్లలెంతోమంది - పెల్లాణికొక్కణ్ణి।
తల్లిముసలిది బాబె - పళ్లూపోసిత్తారు।
దండాలు బాబోయి - దండాలుమీాకు॥

## 11 వ పాట.

### సుగుణమణి.

లోకములే వేడిచానా - నీ కన్నదిక్కెవరిగానా॥
భువిలోన - సరిగాన - దరమాన - సమాన॥
సాధునిజాపుము తల్లి - సాధురాలకల్పవల్లి।
కృపజల్లి సురమల్లి - గనుమొల్లి - పెదతల్లి॥
శాంతునిజాపెద వేని - కరమునిచ్చెదబోణి।
అలివేణి - సుకవాణి - ఘనవేణి - విరిబోణి॥

కొద్దిప్రతులు మాత్రమేగలవు. త్వరపడుడు.

ముఖ్యంగా అట్ట కాలికోబైండు గిల్టుఅక్షరములు

మహాకవి

# కాళిదాసచరిత్రము

మనలోకంబున గావ్యంబులు, నాటకములు, మొదలగు మహాగ్రంథము లెన్నియో రచియించి కవికులసార్వభౌముండని జగత్ప్రసిద్ధి వహించిన, కాళిదాసునివంటి మహాకవి మరియొకడు లేడని చెప్పుట యెంతయు సత్యమేగాని యతిశయోక్తి కాదు. ఈతనికథ చెప్పుకొనునప్పుడట్టిమహాపండితులైనను నితరప్రసంగములు మాని తదేకలగ్నమానసులై యదియె వినుచుందురనుమాట మనకెల్లరకు ననుభవసిద్ధమగువిషయమే వేయుమాటలేల? బాలురు మొదలు వృద్ధులువరకు స్త్రీలు పురుషులు నందరును, నిమ్మహాకవిచరిత్రమును వినవలయునని యే కోరుచుందురు. ఇతనిచరిత్ర మతివిచిత్రము. ఈకవికులశేఖరుండు భోజమహారాజు నాస్థానంబున బ్రవేశించి యందు లెక్కలేనియత్యద్భుతకృత్యంబు లొనర్చి యామహారాజు నానందరసాబ్ధి నోలాడించెను. ఈగ్రంథమందు కాళిదాసుడు కాళికాదేవిని బ్రత్యక్షము నొనర్చుకొనుటయు నామెవలన ననేకవరంబుల వడసి సకలవిద్యాపారంగతుండై భోజునియాస్థానంబు జేరుటయు నందలి పండితులందరికన్న నత్యధికుండై యామహారాజుచే నీయబడిన యత్యద్భుతసమస్యల బూర్తిచేయుట మొదలగు చిత్రవిచిత్ర చరిత్రంబులెన్నియో వ్రాయబడి యున్నవి. ఈచరిత్రంబున ననేక కథలయందలి శ్లోకమున కాకథయందే శ్లోకము క్రింద బ్రతిపదము వ్రాయ

బడి యున్నది. 128 పేజీలుగలవు. నేడే కార్డు వ్రాయుడు. వెల 1—4—0.

## సంగీత సావిత్రి

5 అంకముల చక్కనినాటకము. చిన్నలు, పెద్దలు, స్త్రీలు మొదలైనవారు జదువుటకు సులువుగా నుండును. గొప్పనాటక కంపెనీ వారిచే యాడబడుచున్నది. కాళహస్తిసూర్యప్రకాశరావు గారిచే రచియింపబడిన పాటలుగలవు. సుందరమైన నాలుగు చిత్రపటములు నాటకరంగమువిూద తీయబడినవి యుండును.

వెల 0—12—0

మావద్ద నవలలు, నాటకములు, హరికధలు, ప్రహసనములు, శతకములు, ప్రబంధములు మొదలగు గ్రంధములు సరసమైన ధరలకు విక్రయించబడును.

వలయువారు:—

కాళహస్తి తమ్మారావు అండుసన్సు,

సంస్కృతాంధ్ర బుక్కుడిపో, రాజమండ్రి.

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము